# స్టాలిన్‌గ్రాడ్

## యుద్ధ చరిత్ర

•

వివిధ సోవియట్ యుద్ధ
విలేఖరులు, రచయితలు

•

విజ్ఞాన సాహిత్యవనం
బెజవాడ :: సికింద్రాబాడ్

సంపాదకుడు:

పలసాని రామారాము

*

ప్రచురణ ౯: ప్రథమ ముద్రణ

డిశెంబరు, '45.

*

వెల :



బి. యన్. కె. ప్రెస్, మద్రాసు.

2

# కృతజ్ఞత

స్టాలిన్‌గ్రాడ్ యుద్ధం ముగిసి చాలకాలమైంది. అయినా ప్రపంచ చరిత్రలో, ముఖ్యంగా ప్రపంచ యుద్ధచరిత్రలో అతి ప్రముఖ స్థానాన్ని వహించే యీ చరిత్రాత్మక ఘట్టం యొక్క ప్రాముఖ్యత, విలువను కాలం యేమీ పాడు చెయ్యలేదు. తరతరాల ప్రజలు యీ యుద్ధరంగ చరిత్రను తెలుసుకోవలసిన అవసరం యెంతైనా వుంది. అందువల్ల ఆలస్యమైనప్పటికీ ప్రకటిస్తున్నాను. మొదట ఇంగ్లీషులో ప్రజా ప్రచురణాలయం, (Peoples Publishing House) బొంబాయివారు ప్రచురించారు. దీనిని తెలుగులో ప్రచురించుటకు దయతో అనుమతించిన ప్రజాశక్తి సంపాదకులకు మా కృతజ్ఞతాభివందనాలు!

—సంపాదకుడు.

## Order of the day

### డాన్‌రంగం

సుప్రీమ్ కమాండ్ యొక్క జనరల్ హెడ్క్వార్టర్సు ప్రతినిధి, తొల్బుల సేనాధిపతి, కామ్రేడ్ వొరోనోవ్‌కి డాన్‌రంగం సేనాధిపతి, కర్నల్ జనరల్ కామ్రేడ్ రొకొసోవ్‌స్కీ.

స్టాలిన్‌గ్రాడ్‌ను ముట్టడించిన శత్రుసేనలను తరిమి విజయవంతులయిన మిమ్ము, డాన్‌రంగంలోని సైనికులను మిమ్ము అభినందిస్తున్నాము.

డాన్‌రంగంలో అత్యద్భుత విజయాలకు కారకులైన సైనికులకు, నాయకులకు, రాజకీయవేత్తలకు నా హృదయపూర్వకాభివందనాలు.

మాస్కో, క్రెమిలిన్
2-2-43.

జె. స్టాలిన్
సర్వసేనాధిపతి.

5



# స్టాలిన్‌గ్రాడ్ మహాయుద్ధం

స్టాలిన్‌గ్రాడ్ యుద్ధం ముగిసింది. సంవత్సరాలు, తరాలు గడచిపోయినా స్టాలిన్‌గ్రాడ్ యుద్ధగాధ పద్యాలుగా వ్రాయడానికి, చదవడానికి వర్ణనకు చిరకాలము పనికి వచ్చేదిగా వుంటుంది. సోవియట్ ప్రజల స్మృతిపథంలో వారి ధైర్యం, దేశభక్తి, శత్రుద్వేషాలకు చిహ్నంగా వుంటుంది. వారి శత్రువులకు ఓటమి, విధ్వంసనల భయం కరఛాయగా వుంటుంది.

ఈ యుద్ధం సైనిక కళాశాలలో బలవత్తరమైన రక్షణలకు, యింతవరకు ఏ యుద్ధచరిత్రకు తెలియని అపూర్వ వీధిపోరాటానికి ఉదాహరణగా చెప్పబడుతుంది. ఈ యుద్ధంలో స్టాలిన్‌గ్రాడ్ మధ్యలో శత్రువు యినుప మొన మొక్కపోగొట్టి, తర్వాత విరగగొట్టబడింది. శత్రువు మన దేశ మధ్యభాగానికి రావటానికి, మాస్కోను వశపరచు కోడానికి తెచ్చిన అదనపుశక్తివంతములైన దళాలను అడ్డగించి, నాశనంచేశాం. స్టాలిన్‌గ్రాడ్ యుద్ధం ప్రపంచయుద్ధ చరిత్రలో ప్రకాశవంతమయిన చిహ్నముగా వుంటుంది. యుద్ధకళను అభివృద్ధిచేయడానికి యితోధికంగా తోడ్పడుతుంది.

యుద్ధచరిత్రలో స్టాలిన్‌గ్రాడ్ రక్షణవర్ణనంతా, ఎర్ర సైన్యం యెలా ప్రమాదాన్నుంచి తప్పించుకొని విజృభించి తమను చుట్టుముట్టిన 22 జర్మనుదళాలను నాశనచేసిందో;

యీ పోరాటం యెలా గొప్ప యుద్ధంగామారి చుట్టుముట్టిన శత్రు అంతంచూచిందో; డాన్ నదిగట్టులు, ఉత్తర డానెట్జ్, మూసిచ్ రంగాలను రక్షణకేంద్రాలుగా యెలా చేసుకుందో ఆసక్తితో నిరూపిస్తుంది. స్టాలిన్‌గ్రాడ్ లోపలికి చొచ్చుకు వచ్చిన తరువాత జర్మనుదళాలు తమ తుదిమొదళ్ళను వోల్గానది ఒడ్డున పెట్టి, నగరాన్ని అర్ధచంద్రాకారంగా చుట్టుముట్టి నగరమార్గాన్నంటిని తగులబెట్టి, మంటలలో నుంచి నదికి ఆవలవైపునుంచి తమ మార్గాలను యేర్పరచుకున్నారు, నవంబరులో స్టాలిన్‌గ్రాడ్‌లో ఫ్యాక్టరీజిల్లా ఒక్కటే ఆక్రమించుకోవలసి వుందనీ, నగరంలోని మన సైన్యాలల్లో కొంతభాగం జర్మనులకు చిక్కిందని అతి త్వరలోనే బోల్షివిక్కులనందరిని వోల్గానదిలో ముంచుతామని జర్మనులు గొప్పగా ప్రకటించారు. హిట్లరు రీచ్‌స్టాగ్‌లో తను వోల్గానదిమీద సురక్షితమైన తిష్ట వేసుకున్నానని, తన దళాలుహాయిగా, సుఖంగావచ్చే శీతకాలపు దండయాత్రకు సంసిద్ధమౌతున్నాయని గప్పాలుకొట్టాడు. ఇంతలోనే చాలా జర్మనుదళాలు దురదృష్టవశాత్తు వెనక్కుపోయి, యింకొక కొత్త దండయాత్రకు మళ్ళీ సైన్యాన్ని పునర్నిర్మించుకోవలసివచ్చింది.

ఏకోవిధంగా ఎఱ్ఱసైన్యం స్టాలిన్‌గ్రాడ్ వద్ద యుద్ధాన్ని సాగిస్తూ జర్మనులకు అధికనష్టాన్ని కలిగిస్తూంది. హిట్లరు విధిలేక అధికదళాలను రిజర్వుదళాలనుంచి సైన్యాలను రప్పించవలసివస్తూంది. తమ సైనికబలాలను కొంతవరకు బలహీనపరచటంకోసం జర్మని సైన్యాధిపతులు తమ

ఉద్యోగాలకు రాజీ నివ్వవలసివచ్చింది. వారి యెడమ సైనిక భాగం మూరానవున్న వెనుకభాగం డాన్ నది పాలుకావటం వల్ల డాన్ నదికి, వాల్గానదికి మధ్యభాగంలో వారి బలాలు సురక్షితంగా వుండటంవల్ల వారి కుడిపార్శ్వం ఆక్రమిత భాగాలలో వుండటంవల్ల కూడా వారు కొంత ధైర్యంచెంది అలాచేసారు. బహువిధ మార్గాలున్నందువల్ల ఫాసిస్టులు వారి రిజర్వుదళాలను అవసరమైనపుడు అవసరమైనచోట్ల కేంద్రీకరించి యుద్ధతంత్రాన్ని కొనసాగిస్తున్నారు యింకా. స్టాలిన్‌గ్రాడ్ రంగం అనేక వైమానిక కేంద్రాలతో చక్కగా నిర్మింపబడివుంది. వాటిని తమ రిజర్వుకాల్బలం వచ్చేవరకు జర్మనులు విమానబలాన్ని అమితంగా దింపి మన సైన్యాలను అడ్డగించటానికి వైమానిక కేంద్రాలను వుపయోగించుకున్నారనే సంగతి మనం మరచిపోకూడదు.

హిట్లరు వేసిన లెక్కలలో మన ఎఱ్ఱసేనబలాన్ని తక్కువగాను, తన బలాన్ని యెక్కువగాను వూహించి పెద్ద పొరపాటు పడ్డాడు. మన 62వ సైన్యం స్టాలిన్‌గ్రాడ్‌ను యెంతో కాలం రక్షించలేదనీ, యింకొక వూపుతో ఎఱ్ఱసైన్యాన్ని వాల్గానదిలో ముంచవచ్చుననీ భ్రమపడ్డాడు హిట్లరు. అందువల్ల కపటజూదంలో తగులుకున్న హిట్లరు వాల్గా, కాకసస్సులపై వుకు సరియైనదళాన్ని పంపకుండా మతిచెడిన జూదగాడిలాగా వేలకువేలు ఉదనప్రదళాల్ని స్టాలిన్‌గ్రాడ్ కసాయి మశానాలకు తోలాడు.

పాపం! జర్మనులు తమ రక్తప్రవాహంలో దొర్లుతూనే స్టాలిన్‌గ్రాడ్ నగరంలో తిరిగారు. టాంకుల్ని,

మంటలు విసిరేయంత్రాల్ని వుపయోగించ ప్రారంభించారు. ఇతర రంగాలనుంచి సాంగాలు త్రవ్వేవాళ్ళను రప్పించి యిక్కడ కేంద్రీకరించారు. ప్రత్యేకంగా వీధి పోరాటాల కోసం ప్రత్యేక శిక్షణ పొందిన పోలీసు దళాలనుకూడా జర్మనీనుంచి తెప్పించారు. జర్మనీ సైనికాధికార శాఖ "ఎఱ్ఱ అక్టోబరు" వర్క్సు ప్రాంతాన్ని పట్టుకోవడంతో 42 లో యుద్ధం అంత్యదశకు వస్తుందని ప్రకటించింది.

లెఫ్టినెంట్ జనరల్ చుకోవ్ నాయకత్వాన 62 వ సైన్యం వుగ్రతరమైన జర్మనుల ముట్టడులను యెదుర్కొంటూ వీరోచితంగా నగరాలను రక్షిస్తోంది. ఫాసిస్టుల వొత్తిడి అసామాన్యంగా వుంది.

*　　　　*　　　　*

ఈలోపున ఎఱ్ఱసేన సేనానాయకులు విజయవంతమైన వొక చక్కని వ్యూహం పన్నారు.

మన సేనానాయకు యుద్ధవ్యూహ దూరదృష్టి, గంభీరమైన పరిస్థితుల పరిశీలనాశక్తి, శత్రుసేనల పన్నుగడలను గ్రహించే సూక్ష్మబుద్ధి; యిక్కడ హిట్లరు తనకున్న బలవత్తరమైన సైనిక దళాల్ని నిలిపి పోరు సలిపాడో, యేరంగ విజయంమీద తనపేరు ప్రతిష్టలు ఆధారపడి వున్నాయని ఆశించాడో ఆ స్టాలిన్‌గ్రాడ్ రంగంలో యెదురుదాడును సాగించి జర్మను సేనలను తుది ముట్టడించడానికి యెక్కువ సైన్యాన్ని కేంద్రీకరించవలసిన అవసరాన్ని మన సేనానాయకులను గుర్తింపజేసినాయి. అందువల్ల శత్రుగమ

నాన్ని ప్రతి అడుక్కీ అడ్డగించడంకోసం పెద్దయెత్తు దాడి నెదుర్కోడం అవసరం.

తరువాత వచ్చిన ఫలితాలే ఎఱ్ఱసేనా నాయకుల దూర దృష్టిని రుజువుచేసినయి. వారు వొక్క స్టాలిన్‌గ్రాడ్ రంగానికేగాక యితర రంగాలకుకూడా నిగూఢమైన వ్యూహాల్ని తయారుచేసి సైన్యాల్నికూడా చురుకుగా నడిపించారు. వారి అకుంఠిత కార్యదీక్ష ఫలితంగా అన్ని రంగాలలోను విజయంసంప్రాప్తమయ్యింది.

డాన్ నదిమీద కేంద్రీకరింపబడ్డ హిట్లరు సైనిక నివహాల మీద వొక్కుమ్మడిని పెద్దయెత్తుదాడులు జరిపి హిట్లరు సైన్యాలు వెనుకభాగాన ముట్టడిజరిపి చెల్లాచెదురుచేయ దల్చుకున్నారు. ఇది అత్యంత క్లిష్టమైనకార్యం. అత్యంత నిపుణతతో కేంద్రీకరించబడ్డ షాక్ట్రూపుల (మెరుపు దళాలు) ఆధిక్యతవల్లనే విజయసాధనకు మార్గమేర్పడింది. ఆప్రాంతం డాన్, వాల్గా, చిరా నదులవల్ల విభజింపబడడం వల్ల యింకా క్రొత్తయిబ్బందులు యేర్పడినయి. నదులకు యెదురుముఖంగా యుద్ధం చేయడం యెప్పుడూ కష్టమయిన పనే; ఎందుకంటే ఆ రకమయిన యుద్ధాలు చేయడానికి సైన్యాలకు ప్రత్యేకశిక్షణ కావాలి. మనసేనలు స్టాలిన్ గ్రాడువద్ద, శత్రుశాంబుల మంటలలోనుంచి, రెండుసార్లు డాన్‌నదిని దాటవలసివచ్చింది. రెండోసారి శత్రురక్షణ శ్రేణులమధ్యనుంచే పోవలసివచ్చింది. ఆ తరువాత వాల్గా, డాన్ నదులమధ్య యుద్ధం తీవ్రతరమౌతుంది. అప్పుడు మన

దళాలు వెనుకనున్న రక్షణనుంచి ఈ రెండు నదులవల్ల వేరుచేయ బడుతాయి. యుద్ధశాస్త్రంలో శత్రురక్షణ శ్రేణుల్ని ఛేదించడం అనేది చాలా కష్టతరమైనకార్యంగా, వొక్కమ్మడిని పెద్దయెత్తుదాడులు జరపడం, మంచిచురుకుదనం, సైనిక శిక్షణవున్న సైనిక విన్యాసంగాను చెప్పబడ్డాయి. శత్రుసేనలను చుట్టుముట్టాలంటే సైనికులకు సేనానాయకులకు అసాధారణశక్తి సామర్థ్యాలు కావాలి. అద్భుతమైన యెత్తుగడలవల్ల విజయంసాధ్యమవుతుంది.

స్టాలిన్‌గ్రాడ్ వద్ద ఒకదాని తర్వాత ఒకటిగా, చక్కని యుక్తితోగూడిన ప్లానుప్రకారం దాడులు జరిగినయ్. శత్రురక్షణశ్రేణులు ఛేదింపబడగానే నదుల్ని దాటడం మొదలుపెట్టారు. వెంటనే ఒక్కమ్మడిని పెద్దయెత్తునదాడి ప్రారంభించి శత్రుసైన్యాలను చుట్టుముట్టి, అప్పటికి ఆ కార్యాన్ని పూర్తి చేసేవారు. ఈ పెద్దయెత్తు దాడులు మూడురంగాలలో చేయవలసివచ్చింది. అయినప్పటికీవిశిష్ట నాయకత్వం సరియైన లెక్కలవల్ల సాధ్యమయినాయ్. పూర్తి సహకారం వున్నప్పుడు విజయం తప్పక సిద్ధిస్తుంది. ఒకదళంఆలస్యంచేసినా ఇంకోదళం విఫలమైనా మొత్తం ఆప్రాంతములోని సన్నాహం అంతా భగ్నమౌతుంది. శత్రుసైన్యాలచేత చెల్లాచెదురుగా ఆక్రమించుకోబడ్డ విశాల భూభాగం మీద యుద్ధసన్నాహాలు కొనసాగించవలసి వచ్చింది.

ఇంతవరకు యుద్ధచరిత్రలో పారిపోతున్నా, లేక వోడింపబడ్డ శత్రుసైన్యాలనే చుట్టుముట్టిన కథాంశాలనేవిన్నాము,

తిరిగి పారిపోవడానికి గాని, పెద్దసైనిక విన్యాసంగావిం చడానికి గాని వీలులేని ప్రాంతాలలోనే సైన్యాలను ముట్టడించడం చూచాం. స్టాలిన్‌గ్రాడ్ వద్ద అనుకూలమైన విశాల మైదానంలో దాడిచేయడానికి సిద్ధంగావున్న శత్రు సేనలను చుట్టుముట్టాలిసి వచ్చింది. ఫ్రాన్సు, బెల్జియం, పోలండు రంగాలలో అనుభవం సంపాదించి మనమీద యుద్ధంప్రారంభించిన దగ్గరనుంచి హోరాహోరీగా పోరు తున్న నిపుణులైన సేనానాయకుల్ని సుశిక్షితులైన సైని కుల్ని హతమార్చవలసి వచ్చింది. ఇందులో చాలమంది మొదటి ప్రపంచ మహాసంగ్రామంనుంచి యుద్ధశాస్త్రంలో తరిఫీదు పొందుతూవుండి అనుభవాన్ని సంపాదిస్తూ యీ యుద్ధం ప్రారంభమయిన దగ్గరనుంచి జర్మనుసేనా నాయ కత్వం వహిస్తున్నవారున్నారు.

ఉదాహరణకు 8 వ కాల్బలదళాన్ని తీసుకుందాం. 1941 జూన్ 22 వ తేదీ ఉదయం 3-05 గంటలకు సోవియట్ రష్యాలో తన దొంగ జీవితాన్ని ప్రారంభించింది జర్మనీ. గ్రోడ్‌నోదాకా చొచ్చుకువచ్చారు; మిన్‌స్క్, స్మోలెన్‌స్క్, ఘాట్‌స్క్ నగరాలను ఆక్రమించుకుంటూ వచ్చారు; అక్క డకు వచ్చేసరికి మన 29 వ గార్డ్సుదళం, టాంకుదళాలు బొరోడినోవద్ద సోవియట్ శక్తి రుచి చూపించాయి. ఆ దెబ్బతో మాస్కోనుంచి తరలి నీపర్‌నది దాటి అంతు లేకుండాపోయారు. మళ్ళీ 42 యుద్ధానికి సన్నాహాలుచేసారు. లేకపోతే క్లీస్టుటాంకు సైన్యంలో భాగమైన 16 వ టాంకు దళాన్ని తీసుకుందాం. ఆ దళం సోకల్, డూబ్నో, కిరోవో

గ్రాడ్. నీప్రోపెట్రోవ్స్క్‌లను ఆక్రమించుకుంటూ రోస్టావ్ వద్దకు వచ్చింది. అక్కడ 41 లో చావుదెబ్బలుతిని దానితో చక్కని గుణపాఠం నేర్చుకొని తిరిగి కొన్ని అదనపు దళాలను తెచ్చుకున్నారు. స్టాలిన్‌గ్రాడ్ వద్ద, బెర్లిన్‌తో నిర్మించబడిన గుడెరియన్ టాంకు సైన్యంలో భాగమయిన మూడవ మోటారుదళంకూడా వుంది. ఈ దళం మాస్కో, టులా, వొరోనిచ్ పట్టణాలవద్ద పోరాడి స్టాలిన్‌గ్రాడ్‌ను ముట్టడించడానికి ముందుగా ముందుకువచ్చింది.

ఈదళాన్ని యేరికూర్చి, ఋతువుల కనుగుణ్యంగా తయారు చేయబడిన ఆధునిక ఆయుధ సామగ్రితో, 20, 35 సంవత్సరాలు మధ్య వయస్సుగల్గిన 'ఆర్య' యోధులతో కూడి యుండి సికుతైన ఫాసిస్టు సైనికోద్యోగులచే నడుపబడేవే! ఇది యెంత పెద్దయెత్తు దాడినైనా యెదుర్కొని అడ్డగించ గల బలియమైనసేన. ఈ సేనను పరిమార్చటానికి గట్టి వృక్క వలయ, బలమైన సమ్మోటపోట్లు కావలసి వచ్చినయ్.

* * *

మన సైన్యాలు, సర్వసేనానాయకులు తయారుచేసిన ప్లానుల ప్రకారం యుద్ధం కొనసాగించడానికి పట్టుదలతో, పూర్తి ప్రయత్నాలు చేసాయి. ప్లానులో యేమీ పారబాటు లేదు. సైన్యాలుచేసే యుద్ధంమీాదే ఆధారపడివుంది యుద్ధం అంతా. మనసైన్యాలు డాన్‌నదిని దాటడానికి ప్రయత్నించేసాయికాని అంతకుముందే శత్రువు డాన్‌నది గట్లను ఆక్రమించుకు కూర్చున్నందువల్ల మన యుద్ధసన్నాహాల నన్నిటిని రాత్రిపూటే కొనసాగించవలసి వచ్చింది. డాన్‌నదిగట్ట

గట్టడం ప్రారంభించింది. ఇంకా పడవలతో నేటిని దాటడం సాధ్యంకాదు. ఆ పలుచటి మంచుపొరమీదనుంచి పోవడం ప్రమాదం. వంతెనలు నిర్మించడం చాలాకష్టం. ఎడమ వైపుగట్టు అంతా వూచి, రెల్లు, సుడిగుండాలతోను నిండి ఉంది. వీటన్నిటి వెనుక వాండు పేరుకొని యుంది. అందు వల్ల మైళ్ళపొడుగూ వంతెనలు నిర్మించవలసి వచ్చింది. అక్కడక్కడా దగ్గరలో అడవులు లేకపోవడంవల్ల దూరా న్నుంచి బళ్ళమీద దూలాలు తీసికొని రావలసి వచ్చింది. శత్రువును తప్పుడుమార్గాలు పట్టించడంకోసం చాలాచోట్ల చిన్న, చిన్న వంతెనలు అడ్డంగా నిర్మించారు.

గజగజా వణికించే చలిలో, జోరుసకురుస్తూన్న వర్షా లలో వేలకొలది రోడ్ల ఇంజనీయర్లు, త్రవ్వ పనివాళ్లు రాత్రింబగళ్ళనక పనిచేసారు. నిజంగా ఆ పైశాచిక పరి శ్రమచేయడంవల్లనే విజయం సాధ్యమైంది.

ఈ విజయానికి ముందు చివరవారాలలో మనసైనికులు చిన్నచిన్న దాడులవల్ల చాలా శత్రుప్రదేశాలను స్వాధీన పరచుకొని, కుడివైపు గట్టుమీద ముందుకు చొచ్చుకుపోవ డానికి మార్గం యేర్పరచారు. ఇక్కడ సైన్యాలన్నీ వూట జల యంత్రంలాగ (Fountain) కేంద్రీకరించబడి దాడికి బయలుదేరడానికి సిద్ధంగావున్నాయి. ఆ వెంటనే దండ యాత్రకు సిద్ధంగావున్న దళాలను కలిసికోవడానికి వెళ్ళడానికి యేర్పాట్లు అతి చురుకుగా చేయబడ్డాయి.

యుద్ధనిర్మాణప్లానును తయారుచేయడానికి అక్కడ సైని కాధికారులు అంతా రాత్రింబవళ్ళు కృషిచేసారు. కేంద్రీ

కరించబడ్డ దళాలనాయకులు, వివిధ సైనికాధికారులు కలిసి శత్రుశ్రేణులలోనికి పోయి, అక్కడ నేలను పరీక్షించి వచ్చారు. కాల్బలం, ఫిరంగిదళం, టాంకుదళం, అశ్వికదళం, వాయుదళం అన్నీ కలసి ఒక్కసారిగా ప్లానుప్రకారం యుద్ధం కొనసాగిస్తే ఆ యుద్ధం విజయవంత మౌతుంది. అందువల్ల అలాంటి సహకారపద్ధతిలో శత్రుసేనలమధ్య యుద్ధం చేయడానికి ఏర్పాటుచేసారు.

యుద్ధం తీవ్రంగా సాగుతున్న ప్రాంతంలో పెద్ద ఎత్తైన బయలు దేరిన అశ్వికదళాలు శత్రుదృష్టినుంచి తప్పించికొని రహస్యంగా యుద్ధంచేయడం అసంభవం. వందలకొద్దీ విమానాలు పైనుంచి శత్రుసరఫరా కేంద్రాలమీద అగ్నివర్షం కురిపించాయి. టాంకులు, గుర్రాలు పొదలచాటున, చెట్ల చాటున దాచబడి వున్నాయి. విమానవిధ్వంసక శతఘ్నులు ఎక్కువగా వచ్చాయి. కందకాలు చాలా త్రవ్వబడ్డాయి. ఈబలంతో అతిభయంకరమయిన ఫాసిస్టు గాంబుదాడిని నిశ్చలంగా ఎదుర్కొన్నారు. మన దళాలు దాడిప్రారంభించే ముందు అంటే నవంబరు 19 ఉదయం ఆ ప్రాంతం అంతటా మంచు కురిసింది. మొదటి ఫిరంగి గాంబు దాడి జరిగిన తర్వాత తుపాకి, టాంకు దళాలు శత్రుశ్రేణి విచ్ఛేదనానికి ముందుకు చొచ్చుకుపోయినాయి. కొండమీదనుండి దొర్లిపడే బ్రహ్మాండమైన మంచుగడ్డలాగా మనసైనికులు దేశభక్తిపూరితోద్రేకలయి విజృంభించి శత్రుమూకల్ని తుడిచిపెట్టారు.

శత్రుసైన్యానికి ముందున్న సైనికదళాలమీద కొన్ని గం టలసేపు భయంకరదాడి సల్పిన తర్వాత విచ్ఛేదక కాల్బలం, టాంక్ దళాలు శత్రువు యుక్తియుతమైన రక్షణ శ్రేణుల్ని ఛేదించి ముందుకు చొచ్చుకుపోయి, శత్రుపార్శ్వపోరా టాన్ని యెదుర్కొని చుట్టుముట్టి (కొంతమందిని ఖయిదీలుగ పట్టుకొని) స్టాలిన్‌గ్రాడ్ వద్ద జర్మనీసేన యెడమపార్శ్వపు దళాన్ని హతమార్చాయి. ఈ మన సైనిక (శత్రు) విచ్ఛేద నాన్ని ఎదుర్కోవటానికి మూంఛుబలమైన దళాల్ని దింపారు జర్మనులు. కాని మన దళాలు ఆ జర్మనీ అధికదళాల్ని ఎదు ర్కొని అడ్డగించి, శత్రుసైనికవిచ్ఛేదక కార్యానికి భంగం రానీయకుండా తరిమికొట్టాయి.

కలాచ్ వద్దనున్న మార్గంద్వారా మన పెద్దటాంకు, అశ్విక దళాలు శత్రువు వెనుకనుంచి పైబడ్డాయి. ఈ దళాలకు ఎదు రుగా వాళ్ళు మూడవ మోటారుదళాన్ని, 16 వ టాంకు దళాన్ని పంపారు. మన అశ్వికదళం ఒకటి జర్మనీ టాంకు దళంతో యెదుర్కోవలసి వచ్చింది. ఆ టాంకుదళంలో 90 టాంకులున్నాయి. అయినప్పటికీ మన అశ్వికదళానికి అనుబంధించివున్న ఫిరంగిదళం, టాంకువిధ్వంసక యంత్రాల సహాయంతో జర్మనీ టాంకుదళాన్ని చెల్లా చెదురుచేసి ముందుకు సాగిపోయారు మనసైనికులు. మన యితరసేనలు వారి టాంకుదళాలతో కొన్నిటితో పోరాడుతుంటే మన టాంకుదళాలు శత్రువు బయటిపార్శ్వదళాలతో పోరాడి ఆ దళాల్ని సేనాసమూహంనుంచి విడగొట్టి డాన్ వంతెనను తగులబెట్టి, వారిని బంధించికలాచ్‌లోకి చొచ్చుకుపోయాయి.

ఈ లోపుగ మనం స్టాలిన్‌గ్రాడ్‌కు దక్షిణావైపు నుంచి తగిన యేర్పాటులుచేసి దాడిప్రారంభించాం. మన సేనలు స్టాలిన్‌గ్రాడ్ యుద్ధరంగాన్ని పూర్తిగా పరీక్షించి వచ్చాయి. అంటే యెంత విజయవంతంగా యీ పరీక్ష జరిగినదో యీ క్రిందిగాథ తెలియజేస్తుంది. ఇప్పుడు మనకు యుద్ధఖయిదీగ పట్టుబడిన 20 వ రుమేనియన్ కాల్బలనాయకుడైన జనరల్ డిమిట్రెస్కుకు మన సేనలు పరీక్షచేసి తయారుచేసిన యుద్ధరంగ పటాన్ని చూపించాం. ఆ సమయంలో తమ దళం యెక్కడుందో సరిగా గుర్తుపెట్టమని అడిగాం. కాని, అతడాశ్చర్యపోయాడు. ఎందుకంటే తనకు తన అధికారవర్గం లో నుంచి వచ్చిన పటంలో కంటే తన దళస్థానం యిందులోనే సరిగా గుర్తుపెట్టబడి వుందట.

సర్వసేనానాయకుల ప్లానుప్రకారం మన సైన్యాలు శత్రురక్షణశ్రేణులలో బలహీనస్థానాలను కనిపెట్టి సమ్మెట దెబ్బలు కొట్టారు. ఉదాహరణకు 20 వ రుమేనియన్ కాల్బలదళం తీసుకుందాం. ఆ సైదళంవున్న ప్రదేశాన్ని మన సైనికులు ఆక్రమించిరి. రక్షణశ్రేణుల్ని కాపాడుతున్న రుమేనియా కాల్బలదళాన్ని పూర్తిగా నాశనంచేసారు. మన భారీటాంకుదళాలు వూడ్చిపెట్టినయ్. మనటాంకులు 40 వ ఫిరంగిదళం వున్న స్థలానికిచేరి జర్మనుసైన్యాలను తుడిచిపెట్టించిన తర్వాత చూస్తే చివరకు ఒక్కవిమాన విధ్వంసక తుపాకీకూడా పూర్తిగా దాని ఆకారంలో కనుపించలేదు. ఈ విషయాన్ని డిమిట్రెస్కుయే చెప్పాడు. దీని తర్వాత పైటాంకుదళం చొచ్చుకుపోయిన మార్గంగుండా

మరి రెండు ట్యాంకుదళాలు 20 వ సైనికనివహం వెనుక భాగాన రెండుదళాలతో పోరాటము ప్రారంభించారు. ఈ డిమిట్రీయే చివరకు మట్టితప్ప యేమీ మిగులలేదని చెప్పాడు. 'మట్టి' అనే పదానికి యింకా విపులంగా అర్థం చెప్పమని అడిగాం. ఆతడిలా చెప్పాడు: "అస లెప్పుడైనా ఆదళాలు నాక్రింద పనిచేసాయాయనిపించింది."

297 వ జర్మనుదళానికి సర్వసేనాపతియైన మేజర్ జనరల్ మోరిట్జి వాన్ డ్రెబ్బర్ యిదంతా చూస్తున్నాడు. ఈ దృశ్యాన్ని అతడు "రష్యనులు చీల్చుకుపోతున్నారు 'అని వర్ణించాడు. జర్మనీసేనల్ని చెల్లాచెదురుచేయటం చూచాడు డ్రెబ్బర్. రష్యన్ ట్యాంకు యేమీనష్టపడకుండా ధైర్యంతో యీ ప్రమాదకరమైనదాడిని ముగించినయ్. నిజానికి యీ దాడి నెదుర్కోవడానికి అవసరమైన ఆయుధసామగ్రి జర్మనుదళాలకు లేదు. ప్రతిసారీకూడా' 97 వ దళం పార్శ్వ భాగాలను వెనక్కి తిప్పి రక్షణకు పొమ్మనే ఆజ్ఞలనే పొందింది.

మన విజయానికి మూలకారణం సరియైన సమయంలో శత్రుసైన్యాల్ని ముట్టడించటం. మనశత్రువు యింకా స్టాలిన్ గ్రాడ్ మీద యుద్ధం సాగిస్తున్నప్పటికీ ప్రత్యేకదళాలబలం క్షీణించటంవల్ల సైనికపార్శ్వాలను నిలబెట్టలేకపోతు న్నాడు. మనం వొకేసారి చేసిన రెండు సైనిక కేంద్రీకరణలు కూడా సరియైన యెత్తుగనే అయింది. అందువల్ల మన సైన్యాల్ని వాల్గానదిఒడ్డున యెదుర్కోవాలన్న శత్రుసేనలు

బలహీనపడ్డాయి. డాన్ నదిమీద యెదురుదాడి సలపాలను కున్న ప్రయత్నంకూడా విఫలమయింది. ముఖ్యమయిన దాడులను జరపవలసిన మన సేనానాయకులు సరిగా గుర్తించుటవల్లకూడా మనకు విజయం సంప్రాప్తమయింది.

ఈ దాడుల మార్గాలు జర్మనులను తికమకలుగా పోరాడేట్లు చేశాయి; ఆ ప్రమాదకరమయిన పరిస్థితులనుంచి రక్షించుకోవటానికి తొందరపడి ప్రత్యేకదళాలను రంగం మీదికి చిన్నచిన్న గుంపులుగా పంపటంవల్ల, అసలు అరంగ పరిస్థితివల్ల జర్మనులు దీర్ఘంగా పోరాడవలసివచ్చింది.

స్టాలిన్‌గ్రాడ్ వద్ద యుద్ధశాస్త్రంలో ప్రసిద్ధిచెందిన, నిర్ణీతసేనతో, నిర్ణీతస్థలంలో, నిర్ణీతమైన కాలంలో శత్రువు మీద దెబ్బతీయటం అని, త్రైరిక్యదాడిని పూర్తిగా అమలు జరిపాం.

దాని ఫలితంగా స్టాలిన్‌గ్రాడ్‌కు దక్షిణభాగాన కేంద్రీకరింపబడిన టాంకుదళాలకుకూడా ముందుకు చొచ్చుకుపోయి కాలచ్ జేరినయ్. వాల్గానదిఒడ్డునుంచి వచ్చిన టాంకు డ్రైవర్లు, సైనికులు డాన్‌నదిగట్టునుంచి ముందుకు చొచ్చుకు వచ్చిన సైనికులతో కరస్పర్శచేసారు. నవంబరు 23 న హిట్లరు సైన్యాలకు చుట్టూ నిర్మింపబడిన వ్యూహచక్రం పూర్తిగావింపబడింది. మన కాల్బలసైనికులు అశ్వదళ సైనికులు ప్రోత్సహింపబడి ఆచక్రాన్ని బలపరిచారు. ఆ చుట్టుముట్టే కార్యకలాపం అంతా అతిచురుకుగాను నైపుణ్యంగాను గొప్పగాను జరిగింది.

ఇంతకంటె కష్టతరమైన శత్రుసంహారఘట్టానికివద్దాం. శత్రువు కంగారుపడి స్టాలిన్‌గ్రాడ్ వైపుకు పరుగెత్తాడు. జర్మనుసేనాపతులలో కొందరు వెంటనే యీ నగరాన్ని వదిలి రోస్టావ్‌కు పారిపోవటం చాల అవసరం అని గట్టి అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. కాని కొందరు యీ ముట్టడి అంత బలవత్తరమైనదికాదని కొద్దిరోజులలోనే భేదించవచ్చుననే నమ్మకంతో నేవున్నారు.

ఇంతలో బెర్లిన్‌నుంచి చివరదాకా కదలవద్దనే ఆజ్ఞ వచ్చింది. హిట్లరు, ముట్టడిలోవున్న తనసేనలకు తాను తప్పక వాళ్ళను రక్షిస్తాననే ప్రతిజ్ఞను నమ్మవలసిందనే కబురంపాడు. తన సైన్యాలవోటమికి బాధ్యతంతా రుమేనియనుల నెత్తిమీదరుద్ది తన సైన్యాలను క్షమించానన్నాడు. తానొక పెద్దసైనికనిపుణుణ్ణనుకొంటున్న యీ వెఱ్ఱివాడు తన జూదపుటెత్తు తప్పటంవల్ల, సైనికపార్శ్వభాగాల్ని రక్షించలేకపోవటంవల్ల వాళ్ళకీ దుస్థితి సంభవించిందనే సంగతి చెప్పలేదు. చాలకాలంవరకు యీ జర్మనీదళాలకు సంభవించిన ఈ దుస్థితిని జర్మన్‌ప్రజలకు తెలియనీయలేదు.

హిట్లరు సేనానాయకులు యీ విషమపరిస్థితినుంచి తప్పించుకోడానికి నిరాశచెందికూడా విశ్వప్రయత్నంచేసాడు. కలాచ్‌కు పురోగమించేటప్పుడు రోస్టావ్‌నుంచి కొన్ని రైళ్ళతో సైనికుల్ని పంపుతున్నారని తెలిసింది. వెంటనే మూడుటాంకుదళాలు, 2, 3 పారాచూట్‌దళాలు, 6 కాల్బలదళాలు, కొన్ని అశ్వికదళాలతో కూడిన రెండుసేనల్ని

కొటెల్నికోవో వద్ద చిరానదివద్ద కేంద్రీకరించాం. ఈ సేనలకు 'డాన్‌ముఠా' అని పెద్దపేరుపెట్టారు. జనరల్ గూడట్ నాయకత్వం వహించాడు. 6 వ సైన్యం, 4 వ టాంకు దళం 'డాన్‌ముఠా'లతో కలిసికోవడం అవసరమైన స్టాలిన్‌గ్రాడ్ దళాలను విడుదలచేయటానికి యింకోరంగంనుంచి యీ పనిమీద ఫీల్డుమార్షల్ మాన్‌స్టీన్‌ను రప్పించారు.

జర్మనుసేనలు ముట్టడించబడినతర్వాత మూడురోజులకు మాన్‌స్టీన్ చుట్టుముట్టిన చక్రబంధంలో క్రిందిచరావద్ద ఒకచోట కొటెల్నికోవ్‌కు వుత్తరంగాను రెండు చీలికల్ని పెట్టి లోపలికిపోయి జర్మనుసేనలను కలిసికోవటానికి ప్రయత్నించారు. లోపల జర్మనుదళాలు తమ 22 దళాల్నుంచి యేరిన ప్రత్యేకదళాల్ని విస్మయదళాలుగా యేర్పరచి నైఋతిమూలగా కార్పోవ్‌కాకు సమీపంలో, మాన్‌స్టీన్ దళాలు వాళ్ళకు 15,20 కిలోమీటర్ల దూరంలోనికి వచ్చేటప్పటికి దక్షిణంగా వెళ్ళి సోవియట్ సైన్యాలను యెదుర్కోవటానికి వుంచారు. చుట్టుముట్టిన సైనికచక్రాన్ని భేదించడమేకాకుండా మన సేనల్ని తరమాలని వాళ్ళ ప్రయత్నం. వాళ్ళ కేంద్రీకరణదాడులనే సమ్మెట దిమ్మల మధ్య మన సేనల్ని పెట్టి నలగగొట్టమని ఆజర్మనుల నమ్మకం, పాపం!

మనస్థితి చాల విషమంగా వుందనిమాత్రం వొప్పుకోవాలి. దగ్గరలో నిర్మించబడిన వైమానికశాలల్లో (Aerodrome) కేంద్రీకరించబడిన వాయుదళాలు జర్మనీ భూదళా

లకు చాలా సహాయకారిగా వుండేవి. హిట్లరు సేనాపతులే గనుక స్టాలిన్‌గ్రాడ్‌ను వదలిపెట్టి వాళ్ళ పూర్తి 22 దళాల బలాన్ని రోస్టావ్‌కు కదిల్చినట్లయితే పరిస్థితి యింకా విషమతరమయ్యేది. కాని తన ప్రతిష్టను నిలుపుకోవటానికి అలాచేయలేదు. మళ్ళీ ఎర్ర సైన్యాబలాన్ని తప్పుడు అంచనావేసాడు. జర్మనులు ముట్టడింపబడినందువల్ల యేమీ కలతచెందలేదని డంబాలుకొట్టాడు. ముట్టడిలోవున్న జర్మను సైనికులు వాళ్ళ వుత్తరాలలో తమ నాయకుని మీద అచంచలమైన విశ్వాసం, ఫ్యూరర్ వేదవాక్కుల యందు అఖండమైన భక్తికల్గివున్నట్లు రష్యా సైనికులవోటమిని వూహించుకొని మురిసిపోతూ వ్రాసేవాళ్లు.

*　　　　*　　　　*

జర్మను సేనల చుట్టుముట్టేలోపున సోవియట్ సేనానాయకులు పడమటకు, నైఋతిమూలకు, దక్షిణానికి పరిశీలక దళాల్నిపంపారు. అతిభయంకరమైన యుద్ధం సాగుతూంది. ఇక్కడి పరిశీలకదళాలు మార్‌స్టీన్‌దళాల్ని ముందుకుపోనీయకుండా ఆపినయ్. అప్పుడు మనగార్డుదళాలు వుత్తరాన్నుంచి కొండమీదనుండి బ్రహ్మాండమైన మంచుగడ్డలాగ జర్మను సైన్యాలపైబడి కాల్బలబలంలేని మార్‌స్టీన్ సేనల్ని తుడిచిపెట్టి కొటెల్నికోవ్ పట్టుకొని 'డాన్‌ముతా' ను రోస్టావ్‌వైపుకు తరిమాయ్. మనసేనలు నాశనంచేయబడతాయని తాము విడుదల చేయబడతామని యీ ఫాసిస్టు యుద్ధఖైదీల ఆశలు పూర్తిగాపోయినయ్. కాని మళ్ళీ పెద్ద యెత్తు జర్మనీవాడి జరిగేవరకు విమానాలద్వారా వచ్చే

ఆహారపదార్థాల సహాయంతో వుండవచ్చుననే ఆశతో వాళ్లు వీలైనప్రతిచోటునుంచీ, పెద్దయెత్తున దాడి జరపటం కోసమని, సేనల్ని ప్రోగుచేస్తున్నారు.

మన సేనాపతుల ఆజ్ఞతో యితర రంగాలలో కూడా చురుకుగావున్నారు మనసైనికులు. శత్రువునిల్వాలు ఆ రంగం నుంచి యీ రంగానికి, యీ రంగంనుంచి అ రంగానికి మార్చుతూఖంగారు, ఖంగారైపోయారు. స్టాలిన్‌గ్రాడ్ ముట్టడి యింకా అనేకముట్టడులకు మూలం అయింది. ప్రతి ముట్టడీ ఒక్కొక్క చిన్నరంగంగా మారి తనపని తాను చూచుకొంటోంది. దక్షిణాన, మధ్యరంగంలోనూ వొరొనెజ్ రంగంలోనూ దాడులు ప్రారంభమయినాయి. డాన్ నది మధ్యప్రాంతంలో నైఋతి రంగంలో తగిలిన సమ్మెట దెబ్బశత్రు రక్షణశ్రేణుల్ని భేదించింది. ఇటాలియన్ దళాలు అనేక జర్మన్ రుమేనియన్ కాళ్ళకు బుద్ధి చెప్పాయి.

ఇవి అంతిమ యుద్ధాలు, స్టాలిన్‌గ్రాడ్‌నుంచి మిల్లెరొవొ వరకుఉన్న శత్రుసైనికులు చంపబడ్డారు. యుద్ధఖైదీలుగా పట్టుబడ్డారు, పారిపోయారు. వొరొనెజ్-రొస్తొవ్, స్టాలిన్‌గ్రాడ్-టాజిన్‌స్కయా మార్గాలలోవున్న రైలుస్టేషన్లన్నిటిని మనసేనలు పట్టుకున్నాయి. శత్రునివాసాలన్నీ నాశనం చేయబడ్డాయి. జర్మనులు యిక్కడ వాయురక్షణ (Aerodrome) కేంద్రాలనుకూడా పోగొట్టుకొన్నారు. స్టాలిన్‌గ్రాడ్‌కు కనుచూపు మేరలో లేకుండాపోయి మళ్ళీ పునస్థాపించుకోవలసి వచ్చింది విమానశాలల్ని.

మన టాంకుదళాలు శత్రుసేనల వెనక భాగాన ముట్టడి సాగించినయ్. టాజిన్స్కయా స్టేషనువద్దనున్న విమాన శాలలో 350 శత్రువిమానాలను పట్టుకొని స్టాలిన్‌గ్రాడ్‌కు తీసుకపోయారు మన సైనికులు. వాయుయుద్ధంలో చాల తీవ్రమయిన మార్పువచ్చింది. స్టాలిన్‌గ్రాడ్‌కు, మిలెరోవోకు మధ్యనున్న ప్రదేశమంతా ఖాళీఅయింది. స్టాలిన్‌గ్రాడ్‌లో ముట్టడిలోనున్న సేనలకు, అసలు ముఖ్యమైన ప్రత్యేకసేనలకు యెంతోదూరం చేయబడింది. ఇది అన్ని యుద్ధాలలోనూ వొక ముఖ్యమయిన మెత్తుగడ.

*　　　　*　　　　*

పాలస్ సేనలకు లొంగిపొమ్మని తుదినిర్ణయం తెలియజేయబడింది. ఈ నిర్ణయాన్ని త్రోసిపుచ్చారు. హిట్లరు వేలకొలదీ సైనికుల జీవితాలకంటే తన ప్రతిష్టనే యెక్కువగా యెంచాడు. ఇక్కడకూడ జర్మనీ సేనాపతులు తప్పకుండా తమసైన్యాలకు వెంటనే సహాయం వస్తుందని నమ్మించి మోసగించారు. సహాయం సరఫరాలు వస్తున్నాయని డాన్ నదీ ప్రాంతంలో ఫిబ్రవరిలోనే వసంతం వస్తుందనీ, వారి కఠిన పరీక్ష త్వరలోనే పూర్తిఅవుతుందనీ పెద్దపెద్ద కబుర్లు చెప్పిమోసగించారు.

తర్వాత జర్మను సేనాధిపతులకు మాన్‌స్టీన్ మధ్య డాన్ ప్రదేశానికి తరుమబడిపోయాడని, మళ్లీ అతడు తిరిగివచ్చే వరకూ అక్కడేవుండాలనీ జర్మనుసేనలకు చేయటానికి దయ కలిగింది. 16 వ టాంకు దళనాయకుడు తన సైనికులకు

రోస్టావ్ దగ్గర సంభవించిన దుర్భరపరిస్థితిని గుర్తుకు తెస్తూ యికముందయినా అచంచలమైన మనోనిబ్బరంతో పోరాడమని విన్నవించుకున్నాడు. మూడవ మోటారుదళనాయకుడు కూడా పై విధంగానే తన దళానికి యింతవఱకెప్పుడూ పరాజయం కలుగలేదనీ అప్పుడుకూడా కలగకూడదనీ హెచ్చరించాడు.

క్రిస్టమస్ నాటికి తప్పక విముక్తికల్గుతుందని జర్మనీ సైనికులు నమ్మించబడ్డారు. క్రిస్టమస్ వచ్చి వెళ్ళిపోయినాగాని, యీ సైనికులు ముట్టడిలోనే వున్నారు. క్రొత్తసంవత్సరం వచ్చిందిగాని యింకా సహాయంమాత్రంరాలేదు. నిల్వలన్నీ పూర్తిఅయినాయ్. సైనికు లుపవాసాలు చేస్తున్నారు. ఆ ప్రాంతంలో ఒక్క పురుగయినా లేదు. కాని 53 దళాలప్పుడే కలాచ్ చేరిపోయాయని వదంతిపుట్టింది. వాళ్ళ సేనల్ని సంతోష పెట్టటానికిగాను సైనికాధికారులు, వారి బహుమానాలు, ఉద్యోగాలు హెచ్చింపులూ చేసారు. ఏదో ఒక విచిత్రమైన దైవసంఘటన జరిగి, రక్షింపబడకపోతామా అనే వెఱ్ఱిఆశతో యెదురుచూస్తున్నారు. 52 ఉంకర్లు ఒక క్రొత్త ఆయుధాన్ని ప్రసాదిస్తారని ఆశిస్తున్నారు. కాని యుద్ధం ప్రారంభమైన దగ్గరనుంచి ఆనాటివరకూ వాళ్ళు చేసిన అత్యాచారాలకు ప్రతీకారం జరుగుతుందేమో నని సైనికులూ, సైనికాధికారులూ, సేనానాయకులూ అందరూ గుండెలు గుప్పెట్లలో పెట్టుకొనియున్నారు.

ఈ చివరరోజులలోకూడా జర్మనులు సోవియట్ యుద్ధఖయిదీలను వాళ్ళసేనలకు ముందుశ్రేణిలో వుంచారు. ఎందు

కంటే మనసైనికులు తమకాళ్ళమేత్తును కాల్చవలసి వస్తుందని జంకుతో యుద్ధంచేయడానికి వెనుకముందాడుతారు అప్పుడవకాశంచూసుకొని మన సేనల్ని ముట్టడించ వచ్చునని వుద్దేశం. ముట్టడిలోవున్న జర్మనులు సర్వావస్థలూ పడుతున్నారు. ఆ మంచులో క్రిందా మీదా పడుతూ నానా బాధలూ పడుతున్నారు. ఒకప్పుడు ఆ స్థితినే మన సేనలకు కలిగించామనే సంగతిని విస్మరించారు పాపం. అయినా ప్రతీకారం జరుగుతుందేమోనని భయపడి చస్తున్నారు.

*　　　　*　　　　*

ఎప్పుడు సోవియట్ సేనానాయకుల తుది నిర్ణయాన్ని జర్మనులు గ్రోసిపుచ్చారో వెంటనే మన సైనికులు శత్రుసేనల్ని హతమార్చటానికి ప్రారంభించారు. ఆరాత్రంతా కాల్బలదళం, అశ్వికదళం, టాంకులు కేంద్రీకరించబడ్డాయి. ఇంజన్లమోతకు ఆయెడారి ప్రతిధ్వనించింది. ఆ ప్రదేశమంతా సజీవంగా కనుపించింది. కాని శత్రుశిబిరాలలో నిశ్శబ్దం రాజ్యం చేస్తోంది. శత్రువుచేసిన అత్యాచారాలను విచారించి కఠినశిక్ష విధించి యిపుడు వురితీయబోతున్నారా అనిపించింది. అప్పటి ఆప్రదేశంలో జరుగుతున్న కార్యకలాపం అంతాచూస్తే అతనికి ఉచితమైన విధి కృత్యాల నుంచి తప్పించుకోలేడు (శత్రువు)! అతని నగ్నాకారం పట్టపగలేగాక రాత్రి గుడ్డివెన్నెలలోకూడా స్పష్టంగా గోచరమౌతుంది.

ఆ దృశ్యాలనుచూచి ఆరాత్రి మేమనుకున్నాం: యీయుద్ధానంతరం హిట్లరునూ, అతని హంతకులు ముఠాను

యిలాగే ప్రపంచప్రజల కోర్టుముందు నిలబెట్టి విచారిస్తారు. కాని ప్రస్తుతం హిట్లరు తోత్తున్నిమాత్రమే బహుమానిస్తున్నారు. స్టాలిన్‌గ్రాడ్‌లో కొండినాకు 6 కిలోమీటర్ల దూరంలో వున్న యెకటిరినోవ్కా అనేగ్రామంలోవున్న సమిష్టి వ్యవసాయక్షేత్రంలోని సంగ్రేమేవ్ అనే రైతు యింట్లో 1941 నవంబరు 19 తేదీన యీ జర్మను పశువులలో, ఒకడుచొరబడి, ఒకస్త్రీని చెరిచి ఆతడిబట్టలూ, చొక్కాలు, సూట్లు దొంగిలించి, మళ్లీ కొన్నిరోజులతర్వాత 15 ఏళ్ళ అమ్మాయిని యెత్తుకొనిపోయాడు. కాలినిన్ వీధి నిలిజాబత్ యనోవా అనే 18 ఏళ్ళ యువతిని, యింకోమృగం చెరచబోతే, ఆమె తల్లి ఆమెను రక్షించటానికివస్తే, ఆముసిలి తల్లినిచంపాడు. ఆమె శరీరాన్ని బయటపారేశాడు. ఈ సంఘటనకూడా 1941 నవంబరు 19 నే జరిగింది. ఆదరి ద్రపు పీనుగకూడా యిందులోనే వున్నాడు. ఈ పట్టుబడిన జర్మను వెధవలు హంతకులు, రక్తపిపాసలు.

మనసైనికులు యీ జర్మను దళాలతో హోరాహోరిగా పోరాడారు. ఇప్పుడు జర్మనులు పట్టుబడిన ప్రదేశంలోనే మనసైనికుల కుటుంబాలు చాలావున్నాయి. వారు యీ యుద్ధంలో తిన్న గాయాల బాధను మర్చిపోలేరు. వారితోటి కామ్రేడ్స్ దుర్మరణాన్నికూడా మర్చిపోలేదు. ఈశత్రువుల్ని వారిచేతులతో నాశనం గావించటానికి వారికి హక్కుంది.

ఈ సమయంలో అంతకు ముందెప్పుడూ గుర్తించని

యుద్ధ ఆశయాలను, యుద్ధలక్ష్యాలనుం శ్రద్ధతో ఆచరిస్తు న్నారు సోవియట్ సైనికులు.

అదిగో ఆనాటి గ్రుడ్డివెన్నెలలోకూడా స్టాలిన్ గ్రాడ్ నగరం స్వచ్ఛమైన ధవళ కాంతితో వెలుగొందుతోంది, కొద్దిదూరాన. నల్లబడిపోయిన ముఖాలతో మా యెదురుగా మన శత్రుసేనలు! ప్రతీకార ఘడియలు ఆసన్నమయినాయ్.

*　　　　　*　　　　　*

సూర్యోదయ మయేటప్పటికి సేనల కేంద్రీకరణ పూర్తి అయింది. వందలాది తుపాకులు ఆకాశమువైపు చూస్తున్నాయి. ఆ బయలులో దూరంగా కనుచూపు మేరవరకూ టాంకులు వరుసగా అర్ధచంద్రాకారంలో వుంచబడ్డాయి. ఆజ్ఞకోసం యెదురు చూస్తున్నాయ్. ఈ టాంకులప్రక్కనే మన సైనికులు ఆటోమాటిక్ రైఫిల్లుపుచ్చుకొని శత్రుసేనానివహాల్ని ఆతృతతో చూస్తూ, ఆజ్ఞరాగానే యెక్కటానికి నిలబడి వున్నారు. కాల్బల సేనలు రావటానికి మార్గంవదలిపెట్టి దూరంగా మంచులో, యించుమించుగా శత్రుప్రథమశ్రేణులకు దగ్గరగా ఉన్నయిటాంకులు, వురకటానికి సిద్ధంగా.

చివరికి మొదటికాల్పులు జరిగాయి. వందలకొద్ది దళాలు కొన్నివందల టన్నులగుండ్ల వర్షాన్ని కురిపిస్తున్నాయి జర్మన్ సేనలమీద. ఆశ్వికదళాలవెనుక గార్డులకందక మోర్టారులు వస్తున్నాయి. ఈ మోర్టారుగుళ్ళు గాలిలోయెగిరి

నక్కతో కాకారందాల్చి పక్షుల గుంపల్లాగావచ్చి శత్రు సేనల మీాద పడుతున్నాయి. ఆకాశం అంతా పొగతో నిండిపోయింది. కాల్పులు జరిగినప్పుడల్లా వాళ్ళ గుడారాలు ముక్కలు ముక్కలై గాలిలో ఎగరటం, జర్మనులు కంగారుగా అటూయిటూ పరుగెత్తిపడడం, లేవటం, చావటం అంతా స్పష్టంగా కనిపిస్తోంది. మొదటిసారి కాల్పులు పూర్తిఅయిన తర్వాత కాల్బలసేనలు, అశ్వికదళాలు, టాంకుదళాలు జర్మను శ్రేణుల్లోకి చొచ్చుకుపోతూ యెదురు వచ్చిన ప్రతివస్తువును నేలమట్టం చేస్తున్నయ్. శత్రుసేనల్ని హతమారుస్తూ అశ్వికదళాలు, కాల్బలదళాలు శత్రుస్థానాల్ని కూలుస్తూ ముందుకుపోతున్నాయి. శత్రువు కల్పించిన మంటల మధ్యనుంచి కూడ మన అశ్వికదళాలు అతిచురుకుగా తుపాకుల్ని పేల్చికొంటూ శత్రుసేనల్ని నాశనంచేస్తూ ముందుకు పోతున్నయ్.

మన కాల్బలసైనికుల్ని యేదీ అడ్డగించలేకుండా వుంది. క్రిందటి సంవత్సరం మన కాల్బలసేనల్ని, బలపర్చుకొన్న కేంద్రాలవద్ద, యెదిరించేశక్తి కలిగివున్నయ్ జర్మనుసేనలు. వాళ్ళ ప్రత్యేకదళాలు వాళ్ళ శ్రేణులలోనికి చొచ్చుకు పోయిన మన సేనలతో యెదురుదాడిచేశాయి. ఇప్పుడు జర్మనీ ప్రత్యేకదళాలు తరిగిపోయినయ్. బలపర్చబడిన కేంద్రాలలో కూడ మన కాల్బలసేనల్ని యెదిరించలేమనీ, అలా చేయాలంటే బలపడినశ్రేణులు యెన్నోఉండాలని జర్మను సైనికులే అన్నారు. నిజానికి అలాంటి బలవత్తరమైన సైనికశ్రేణుల్ని నిర్మించారు కాని మనసేనలు వాటిని చెల్లా

ఎదురుచేసి లోపలికి చొచ్చుకుపోయి జర్మను సైనికుల్ని హతమార్చాయి.

మళ్ళీ జర్మనీ అధికారులు తప్పుడు అంచనా వేశారు. జర్మనుసైనికులు ముట్టడించబడిన ప్రదేశం ఒకసంచి వెనుక భాగం పడమటివైపుకు త్రిప్పిపెట్టినట్టుంది. ఉత్తర దక్షిణాలనుంచి సేనల్ని తీసుకొచ్చి స్టాలిన్‌గ్రాడ్ వద్ద వాల్గానది మీద ఒకవైపున యీ పైసైన్యాలు కలుసుకొని జర్మను సేనల వెనుకభాగాన, పడమటివైపున ముట్టడి జరపవచ్చునని వ్యూహించారంతా. కాని డాన్‌రంగంలోని సోవియట్ సైనికాధికారులు అన్నివైపులనుంచీ ముట్టడి జరపాలని నిశ్చయించారు. తూర్పునుంచి చుకోవ్ 62వ సైన్యం ఒక్కొక్క అడుగే ముందుకువేస్తూ స్టాలిన్‌గ్రాడ్‌నుంచి జర్మనులను తరమడం ప్రారంభించింది. ఇతర సైన్యాలు తక్కిన వైపుల్నుంచిదాడి ప్రారంభించినయ్. అసలు ప్రధానదాడి యెక్కడ జరుగుతుందో శత్రువుకు తెలియలేదు. కంగారుపడి ప్రత్యేకదళాలు, బిలియర్డ్సు బల్లమీద గుళ్ళలాగ, దారితెన్ను తెలియక అటూయిటూ తిరుగుతున్నయ్. అక్కడి దాడి విజయవంతంకాగానే డాన్‌రంగం అధికారులు కొత్త అదనపుదళాల్ని రప్పించి అశ్విక, టాంకు దళాల్ని కేంద్రీకరించాయ్.

మన అశ్విక, కాల్బల దళాలదెబ్బకు తాళలేక వెనుదిరిగి, చచ్చినసైనికుల్ని గుట్టలు గుట్టలుగాపడేసి, పోట్లాడుకున్నట్లు నటిస్తూ పారిపోయారు జర్మన్ వీరులు. జర్మను అధికారులు చాలాసార్లు పారిపోవటానికి ప్రయత్నించిన సైనికుల్ని

కొల్చమని ఆజ్ఞలు పంపినా అవేమీ పనిచెయ్యలేదు. ఫాసిస్టు లకు యీ యుద్ధం జీవన్మరణ సమస్య అయింది. చివరకు యేదీ శత్రువులను రక్షించలేకపోయింది. నాశనం కావడమే ఫలితమయ్యింది. ఫిబ్రవరి 2వ తేదీన చరిత్రాత్మక ప్రసిద్ధి చెందిన స్టాలిన్‌గ్రాడ్ యుద్ధం సర్వశత్రు నాశనంతోనూ, మనకు సంపూర్ణ విజయంతోనూ ముగిసింది.

*　　　*　　　*

క్రిందటి ప్రపంచయుద్ధంలో 1918 ఆగస్టు 8న పడమటి రంగంలో జర్మనుసైన్యం పెద్ద దెబ్బతిని ఓడిపోయింది. ఆగస్టు 8ని జర్మనులు "జర్మనీ చీకటిదినం" అనేవారు. స్టాలిన్‌గ్రాడ్ వద్ద యిప్పుడు రాత్రింబగళ్ళు కూడా ప్రకాశ వంతంగావున్నాయి. ఆ కాంతివంతమైన బయలు స్వాతంత్ర్య వాయువులతో స్టాలిన్‌గ్రాడ్ ముందు విజయవీరులకు ఉత్సా హాన్ని రేకెత్తిస్తోంది. అక్కడి స్వేచ్ఛావాయువులు విజయో త్సాహ ధ్వనులతో నిండివున్నాయ్. జర్మను ఖైదీలు అవి జర్మనీకి "చీకటి దినాలు" అంటారు.

కాని యీ జర్మనీకి "చీకటి దినాలు" ముందున్నాయి యింకా. మన పవిత్ర మాతృభూమినుంచి యీ హిట్లరు పిచ్చికుక్కల్ని దూరంగా తరిమేనాడుగాని యీ "చీకటి దినాలు" కనుపించవు.

కాని దేశంలోని సామాన్యపౌరుని వద్దనుంచి ఒక జన రల్ వరకు యిదేవిషయాన్ని ఆలోచిస్తూ ఆ రోజుకోసం యెదురు చూస్తూన్నారు. శత్రువినాశంకోసం, నిరంతరం

యుడ తెగకుండా మాతృదేశ రక్షణకోసం పోరాడుతున్న ఎఱ్ఱసైన్యానికి సరఫరాలు పంపుతున్న మన ప్రజల మనో నిబ్బరంమీద, మన ఎర్రసేన బలంమీద ఆధారపడి మనం పైనిర్ణయాన్ని తీసుకొంటున్నాం. ఇంతవరకు ప్రపంచ యుద్ధ చరిత్రలో కనివిని యెరుగనట్టి స్టాలిన్‌గ్రాడ్ యుద్ధవిజయానికి కారణభూతుడైన మన సర్వసేనానాయకుని అద్భుతమైన నాయకత్వ ప్రతిభమీద అధారపడి ధైర్యంగా పైనిర్ణయాన్ని చేసుకుంటున్నాం.

వాసిలి గ్రోస్మన్

నవంబరు 13, 1942

## జారిట్సిన్ - స్టాలిన్‌గ్రాడ్

మానవుల కున్నట్లే నగరాలకుకూడ విధి నిర్ణయాలుంటాయ్. అలాంటిదే యిప్పుడు జారిట్సిన్ - స్టాలిన్‌గ్రాడ్‌కు సంబధించింది. ఈ నగరం వాల్గా నదిమీద ఉత్తర దక్షిణాలకు రెండు పాయలుగా చీలు ప్రదేశములో ఉంది. నగరం వెనకభాగాన కజాక్‌స్తాన్ బయలు ప్రదేశాలు ఉన్నాయ్. అంటే అంతదాకా నగరంవ్యాపించింది. నగరం వెడల్పుగా డాన్, కూబాన్ నదుల సారవంతమైన భూములవైపుకు పెరిగిపోయింది పడమరగా. జాతి అంతిమ దినాల్లో పతనం కానీయకుండా నిలబెట్టడానికీ, విప్లవాన్ని తేవడానికీ, అవసరమైనవస్తు సంపదను కలిగివుం దీ నగరం.

ఇరవైనాలుగు సంవత్సరాల క్రిందటిమాట. ఉత్తర దక్షిణాలనుంచి బ్రహ్మాండంగా ఎత్తివస్తూన్న విద్రోహక

శత్రుసేనల్ని యెదుర్కొని, శత్రుదాడిని అరికట్టింది జారిట్సిన్ నగరం. శత్రుదాడి నడ్డగించడానికి కోటగుమ్మాని కమర్చబడే, జారుడు తలుపుల్తో, పెద్దయెత్తు దాడితో వస్తున్న జర్మనులను ఆపుచేసే పురాతన కోటలాగ ఉంది జారిట్సిన్ నగరం.

ప్రశాంతమైన యిరవై సంవత్సరాలు గడిచిపోయినై. గుమ్రక్, ఒర్లొవొకా, బెకెటోవ్కా నగరాలకు సమీపాల్లోని కందకాల్లో పచ్చగడ్డి పెరగడంవల్ల వాటిస్థానాలు గుర్తించడం కష్టం. ఇదవరకు సరఫరా రైళ్లు తిరిగినచోట పెద్దపెద్ద వృక్షాలు పెరిగినై. జారిట్సిన్ నగర రక్షణలో పాల్గొన్న యోధులంతా గతించిపోయారు. ఆనాటిస్వచ్ఛంద సేవక కార్మికుల నల్లనిజుట్లు ముగ్గుబుట్టల లాగైనాయ్. అనాడు ఎఱ్ఱసేన వంటశాలల్లో పనిచేసిన యువకులు, ఖరైచ పోయిన తోటాగుళ్ళను యుద్ధం మధ్యలో ఏరుకొని వచ్చిన యువకులు యీనాడు పెద్దవాళ్లై. కుటుంబాలకు పెద్దలుగా ఉంటున్నారు, సోవియెట్ ప్రభుత్వంలో ప్రముఖులుగా వున్నారు. ఒకప్పుడు కార్మికుల నికృష్టపు జీవితాలనుంచి గొప్పవైజ్ఞానికాభివృద్ధి చెందినవారి అదృష్టం, యీ నాటి స్టాలిన్‌గ్రాడ్ యువకుడు, వైమానికుడు, సేనాపతి అయిన, దూమోవర్కస్లోకార్మికుడైన స్టెపన్ ఖోల్జనోవ్ కొడుకు విక్టర్ ఖోల్జనోవ్ లో కనుపిస్తోంది. వాల్గానదిగట్టున ఉన్న స్టాలిన్ గట్టుమీద ఇత్తడితో చేసిన విక్టర్ విగ్రహం నదిలో ప్రతిఫలిస్తుంటుంది.

అతిచురుకుదనంకూడా స్టాలిన్‌గ్రాడ్ ప్రజల్లో వచ్చిన ముఖ్యమైన మార్పుల్లో ఒకటి. జర్‌జిన్‌స్కీ ట్రాక్టర్‌ప్లాంట్, రెడ్ అక్టోబరువర్కు్స, బారికేడ్‌వర్కు్స, మొదలైన పెద్ద పెద్ద యంత్రాగారాల్లో వేలకొలదిమంది పనిచేస్తున్నారు. కొత్తగా ఒకనౌకా నిర్మాణశాల, స్టాలిన్‌గ్రాడ్ హైడ్రో-ఎలెక్ట్రిక్ పవర్‌స్టేషన్ స్థాపించబడ్డాయి. పాతయంత్రాగారాలను పునర్నిర్మాణంచేసి అనేకవందల కొత్తయంత్రాగారాల్ని నిర్మించారు.

ఇదంతా ఎందుకు? ఈ పట్టణంలో జారుల ప్రభుత్వం క్రింద వున్నప్పుడు ఒక్కశతాబ్దంలోనూ రెండు హైస్కూళ్లు, ఒక లైబ్రరీ, ఒక అనాథ శరణాలయం, 400 విశ్రాంతి మందిరాలు (హోటళ్లు) ఉండేవి. కాని యిప్పుడో? అనేక ఉన్నతవిద్యా కళాశాలలు; వైద్య, వాస్తుశాస్త్ర, ఉపాధ్యాయ తర్ఫీతు కళాశాల లనేకములు ప్రతిభాశాలురైన పండితులతో, 1500 మంది విద్యార్థులతో అలరారుతున్నాయి. కొన్నివందల చిన్న పాఠశాలలు, అనేక పారిభాషికకళాశాలలు, లైబ్రరీలు, మ్యూజియంలో, ఉన్నాయి. అసలు ఆనాటి నగరానికీ, యీనాటి నగరానికీ పోలికే లేదు. అంత అభివృద్ధి యిరవై నాలుగు సంవత్సరాల్లో!

నిరంతరం దుమ్ముతో అసహ్యంగా ఉండే రోడ్లన్నీ యిప్పుడు పరిశుభ్రమైన తారురోడ్లుగా మారిపోయినవ్. నగరంచుట్టూ చక్కని చెట్లతోపులు పెరిగినై. వందల కొలది హెక్టర్ల వైశాల్యం కలిగిన పెద్దపెద్ద తోటలు ఎన్నో

వున్నాయ్. అవి గంగిరేణి, బాదాంచెట్లతో అత్యంత శోభాయమానంగా కనిపిస్తుంటాయ్. అంతకుముందు రెండుమూడు అంతస్థుల మేడలు, ఇరుకుమురికి రోడ్లతో చూడటానికే అసహ్యంగా వుండేది. ఇప్పుడు పెద్దపెద్ద తెల్లని భవనాలు, విశాలమైన, శుభ్రమైనరోడ్లు, విశ్రాంతిభవనాలు, బజారు మధ్యలో విశాల విగ్రహాలు, హాయినిచ్చే చెట్లు, అత్యంత శోభానమైన పూతోటలతో కళకళ లాడుతోంది.

రాత్రిళ్లు వాల్గానది ఒడ్డునుంచిచూస్తే విద్యుద్దీపాలతో వెన్నెలు మిరుమిట్లు గొల్పుతూ ఒక పెద్ద పూలమాలలాగు కనుపిస్తుంది స్టాలిన్‌గ్రాడ్ మహానగరం. దుకాణాల, సినిమాల, సర్కసుల, నాట్యశాలల, హోటళ్ళ దీపకాంతులతో శోభిల్లుతోంది. లౌడ్‌స్పీకర్లమూలాన నగరంలోని సంగీతమంతా వచ్చి వాల్గానదిమీద విహారం చేస్తోంది. స్టాలిన్‌గ్రాడ్ ప్రజలంతా తమ నగరాన్ని చూచి సంభ్రమపడి పోతారు. ఆనగరం సోవియట్ యూనియన్‌లోని సుందరమైన నగరాల్లో ఒకటిగా రష్యా స్వతంత్ర వాయువుల్ని పీలుస్తూ, వైజ్ఞానిక కేంద్రమైవుంది సోవియట్ ప్రజలకు.

విహారయాత్రలకొచ్చే యాత్రీకులు స్టీమర్లు యీ దివ్య నగరం సమీపించేకొద్ది స్టీమర్ల పైభాగానికివచ్చి ఆనగర యంత్రాగారాల్లోనుంచి వింతవింత పోకళ్ళలో ఆకాశాన్నంటుతున్న పొగమట్టలు, అందులో స్పష్టంగా కనుపిస్తున్న ఎర్రని ఉక్కుముక్కల రవ్వచూచి మురిసిపోతారు. సముద్రపు ఒడ్డున ఉన్నపుడు ఉరిమిన ఉరుములాగ ఆయంత్రా

గారాలు చేస్తున్నధ్వనిని వింటారు. ఇదే విప్లవజారిట్సిన్ నగరం, ఇదే ఆస్టాలిన్‌గ్రాడ్ నగరం అనీ, ఇది ఒకప్పుడు రష్యనుల విధివి నిర్ణయాల పాలగాకుండా కాపాడి రష్యను జాతికి విముక్తిమార్గాన్ని చూపించిన మహానగరమిదేనవి, అవసరమైతే యీ నాడుకూడ అలాంటిపాత్రనే వహించటానికి సిద్ధంగావుందని అనుకొంటూ ఎంతో ఆనందపరవశులౌతారు.

*　　　　*　　　　*

1918 ఆగస్టు 23 మధ్యాహ్నానికి కమ్యూనిస్టు గని కార్మికుల దళాలు, మొరొజొవా-డానెట్జ్ దళాలు సైనికాధికార సంఘుంయొక్క ఆదేశానుసారం వొరొపొవో నగర సమీపంలో మధ్యరంగంలో దాడిని ప్రారంభించినై. వారు తమ జీవితాలను త్యాగంచేసి, రక్తంధారపోసి ఘోరంగాపోరాడి శత్రువును ఆ నగరంనుంచి తరిమికొట్టారు.

సరిగా 24 సంవత్సరాల తరవాత 1942 ఆగస్టు 23 వ తేదీన సాయంకాలం 5 గంటలకు 80 భారీ జర్మనుటాంకులు, నాయుధకాల్బల దళాలతో స్టాలిన్‌గ్రాడ్‌లో మొట్ట మొదట యంత్రాగారం, ట్రాక్టరు యంత్రాగారంమీద దాడి ప్రారంభించినై. వెంటనే వందలకొలదీ శత్రువిమానాలు స్టాలిన్‌గ్రాడ్ భవనాలమీద బాంబులవర్షాన్ని కురిపించాయి. ఇదే మొదటి భయంకరమైన ఫాసిస్టుదాడి వాల్గానదికి తూర్పు వైపున.

ఆ నగరం పొగమంటల కాహుతైంది. అగ్నిశాఖలు మిన్నుముట్టుతున్నై. యుక్రైన్-డాన్ ప్రాంతంమీద జర్మ

నుల మొదటిదాడికిని ఈనాటి యీ రెండవ దాడికిని మధ్య కొన్ని ప్రశాంతమైన సంవత్సరాలు గడిచిపోయినట్లుంది. కాని యీ జారిట్సిన్-స్టాలిన్‌గ్రాడ్ ఆ పొగమంటల మధ్య కూడే అభేద్యమైన ఉక్కుకోటలాగ చెదరకుండ శత్రు మూకల్ని యెదుర్కొంటోంది.

1918 లో దండెత్తివచ్చిన క్రాస్‌నోవ్ దాడి ఉధృతానికి, 1942 లో జరిగిన దాడిఉధృతానికి భూహ్రాంశాల తేడాఉంది. భీకరమైన టాంకుదళాలఒత్తిడికీ క్రూర తుపాకీ గుండ్ల తాకిడికీ, అతిభయంకరమైన వాయుదళాలదాడికీ క్రిందటి ప్రపంచయుద్ధంలో సర్వవినాశాంతక మనుకొన్న శత్రుదాడికీ యే మీపోలిక లేదు. ఆనాటినుంచి యుద్ధనిర్మాణ కళలో అనేక అభివృద్ధికరములైన మార్పులు జరిగినయ్. ఎత్తుగడ ముట్టడి, యుద్ధవేగాల్లో యెంతో మార్పువచ్చింది. విపరీతమయిన అభివృద్ధి జరిగింది. కాని ఒకేఒక వస్తువు మాత్రమే మార్పుచెందలేదు. అదే ప్రజలు.

ఈనాడు స్టాలిన్‌గ్రాడ్‌నగరాన్ని కాపాడుతున్న వీరులు యే తరం ప్రజలోనని భ్రమపడుతారేమో సుమా! కాదు కాదు. ఏ వీరులు 1918 ప్రపంచయుద్ధాన్ని విజయవంతం చేశారో, ఆ వీరసంతతే యీనాటి ప్రజలు.

24 సంవత్సరాలనాటి యాకోవ్ యర్మాన్, నికొలాయ్ రద్‌నోవ్, ఆలబ్ యెవ్‌లర క్తం యింకా యీనాటి వీరుల నాళాలలో ప్రవహిస్తూనేయుంది. 80 భారీటాంకులు, అంతు లేని విమానదళాల బాంబువర్షం, అకస్మాత్తుగ ట్రాక్టరు

యంత్రాగారాన్ని, స్టాలిన్‌గ్రాడ్ నివాసాలమీద పడినప్పుడు కూడ ఆయంత్రాగారాల్లోని కార్మికవీరులు తమపనిమాన లేదు. ఒక్కరు కూడ భీతిచెందలేదు. అచంచలమైన ధైర్యంతో తమ తమ పనుల్లో నిమగ్నమై వున్నారు.

దాడిజరిగిన మొదటిరాత్రి కొన్నివందలమంది కార్మికులు రైఫిళ్ళు, పెద్దమరతుపాకులు. తేలిక మరతుపాకులు ధరించి ఆ యంత్రాగారానికి చుట్టూ, రక్షణశ్రేణిగా తయారయ్యారు. అక్కడ వారు భారీ మోటారుదళాల. అండతో లెఫ్టినెంట్ సార్కిస్యన్ నాయకత్వంక్రింద జర్మనీ టాంకుల దళాల ఉధృతాన్ని అరికట్టారు. వారు విమానవిధ్వంసక శతఘ్నిదళాల సహాయంతో లెఫ్టినెంట్ కర్నల్ హెర్మన్ నాయకత్వాన హోరాహోరీ పోరాడారు. ఆ దళాల్లో సగం జర్మనీ డైవ్‌బాంబర్ల దళాల నెదుర్కొవటానికి సగంమంది జర్మనీటాంకుదళాలమీద అగ్నివర్షం కురిపించేటానికే నియమింప బడ్డారు. ఎడ తెగని బాంబులమోతలో యితరశబ్దాలేమీ వినిపించటం లేదు. ఈ ప్రదేశానికి ముందు వున్న లెఫ్టినెంట్ స్విస్టన్‌దళం జర్మనీటాంకుల, విమాన ఐక్య పోరాటంయొక్క యొత్తిడికి సర్వనాశనమై పోయుందేమో ననుకొన్నాడు, లెఫ్టినెంట్ కర్నల్ హెర్మన్. కాని కొద్ది సేపట్లోనే విమానవిధ్వంసక శతఘ్నుల భయంకర గర్జనలు వినవచ్చినయ్. కేంద్రఅధికార స్థానాన్నుంచి రాకపోకలు బాధింప బడ్డాయి. ఒక రోజంతా తమస్థానాన్ని కాపాడు కొంటూ శత్రుగమనాన్ని అడ్డగించారు.

ఆగస్టు 24 సాయంకాలం ముగ్గురు సైనికులు గాయపడిన తమ సేనానాయకుణ్ణి సురక్షితంగా స్థానానికి చేర్చారు. ఈ పోరాటంలో చివరకు మిగిలినవారు ఆ ముగ్గురే. తక్కిన వారంతా......... ఎలాగైతే చివరకు శత్రువు మొదటి దాడిని తిప్పికొట్టారు. ఆ పట్టణాన్ని స్వాధీనం చేసుకోవాలని శత్రువుచేసిన ప్రయత్నాలన్నీ విఫలమైనాయ్. యుద్ధం లోనికి-నగరవీధుల్లోనికి, పెద్ద యంత్రాగారాల్లోనికి, కార్మికుల నివాసాలదగ్గరకు-వచ్చింది.

*　　　*　　　*

ఒక స్టాలిన్‌గ్రాడ్ నగరవీధుల్లోనే 2 నెలలు యుద్ధం కూడ తెరిపిలేకుండ సాగింది. ఈ నగరయుద్ధంలో పోరాడిన 30 మంది వీరులు_ముగ్గురు, జర్మన్ భారీటాంకులను వెనక్కి తరిమిన వీరులు, కరేవ్, షోల్యకోవ్ లాంటి కార్మిక స్వచ్ఛంద సేవకవీరులు, ఓల్గాకోవలె వాలంట్రి స్త్రీ వీర వనితలు యింకా ట్యాంకుడ్రైవర్లు, వైమానికులు- అమరకీర్తి సోవియట్ల దేశచరిత్రలో ఉక్కు అక్షరాలతో చిత్రించబడుతుంది. 50 రోజులు తన చిన్నదళంతో ఒక యింటిని రక్షణగా చేసుకొని స్టాలిన్‌గ్రాడ్ నగరవీధుల్ని కాపాడిన సార్జెంట్ పావ్‌లెవ్ అచంచల ధైర్యసాహసాలు మరువరానివి. 'పావ్‌లెవ్ గృహం' ప్రసిద్ధిచెందింది. అధికార ఉత్తరప్రత్యుత్తరాల్లోను, ప్రభుత్వ ఆజ్ఞల్లోనూకూడ అలాగే వ్యవహరింపబడింది. స్టాలిన్‌గ్రాడ్ నగరాన్ని, తమ రక్తాన్ని ధారపోసి కాపాడుతున్న వీరయోధులకు జేజేలు—

ఇప్పుడు యీ వీరనగరం స్మశానవాటికా సదృశ్యమై యింకా తగలబడుతున్న భవనాలతోనూ, అచంచలమైన పురాతనభవనాలతోనూ భీతి గొల్పుతోంది. రాత్రివేళ్ళ చంద్రుడు గుహాసదృశ్యమైన భవనాల్లోకీ, తుపాకిగుళ్ళ కాహుతైన చెట్లమొద్దుల తొఱ్ఱల్లోనికీ తొంగి చూచి భీతి చెంది మబ్బులచాటుకుపోయి దాక్కొంటున్నాడు. వెన్నెల రోజుల్లో ఆస్ఫాల్ట్‌తో నిర్మించబడిన వీధి సంగమప్రదేశాలు (Squares) గడ్డకట్టిన సరస్సుల్లాగ కనుపిస్తున్నయ్. బాంబులు చేసిన గుంటలు మంచుగడ్డల నెరల్లాగవున్నయ్. బాంబుల మంటల కాహుతైన యంత్రాగారాల పొగగొట్టాల్లోనుంచి పొగరావటంలేదు. ఆ యంత్రాగారాల వుద్యానవనాల్లోని అందమైన పుష్పలతాకట్టడాలు స్మశానాలలోని గోరీలలాగు విచారంగా ఉన్నై. యంత్రాగారాలు అల్లరిచేసి దెబ్బలు తిని నిశ్శబ్దంగావున్న కుర్రవాడిలావున్నై.

అది మృతనగరమా! కాదు. ఎప్పటికీ కాదు. స్టాలిన్ గ్రాడ్ పునరుజ్జీవితమౌతుంది. రాత్రింబగళ్లుకూడ విశ్రాంతి వుండదు. ఆయుద్ధసమయంలో శిథిలగృహాల్లోకూడ జీవకళ పోలేదు. సూక్ష్మదృష్టిగల కందకసైనికులు శత్రుఘ్నగమనాన్ని అతిశ్రద్ధతో కనిపెట్టివుంటున్నారు. తుపాకిగుళ్ళు, బాంబులు, వగైరా మందుగుండుసామగ్రి, ఆయుధాలు యీ శిథిలగృహాల్లోనుంచి కందకాల్లోకి బహుజాగ్రత్తగా జేరవేయబడుతున్నై. పరిశీలకులు పెద్దభవనాలపై అంతస్తులనుంచి శత్రువు కదలికలను పరిశీలిస్తున్నారు ఏమాత్రం ఏమరకుండా. సైన్యాధికారులు మ్యాపులను అతిసూక్ష్మంగా

పరిశీలిస్తున్నారు. తయినాతి సిపాయిలు సైనికవార్తల్ని వేగంగా తెలుపుచేసి పంపుతున్నారు. రాజకీయ కార్యనిర్వాహకసంఘంవారు తీవ్రంగా చర్చిస్తున్నారు. వార్తాపత్రికలకు వార్తలు పంపుతున్నారు.

* * *

ఆ శిథిలభవనాల్ని చూస్తుంటే మృతులై వదిలిపెట్టబడిన భవనాలలాగున్నాయ్. కాని అకస్మాత్తుగా ఒకనాడు ఒక జర్మనీటాంకు ఒక యింటిమూలనుంచి అతిజాగ్రత్తగా వచ్చింది. రాత్రింబగళ్లు అతిసూక్ష్మంగా పరిశీలిస్తున్న సైనికుడు యీ టాంకుమీద రైఫిల్‌ను ప్రయోగించాడు. ఆ ప్రక్కయిండ్లోనుంచి విమాన విధ్వంసక శతఘ్నితో టాంకును రక్షిస్తూ టాంకు విధ్వంసక శతఘ్నుల్ని పేలుస్తున్న సైనికులకు రక్షణగా నున్న గోడను కూలద్రోయటానికి కాల్పులు ప్రారంభించాడు ఒక జర్మన్. ఇంకా ప్రక్క మేడపై అంతస్తుపైనుంచి తన సోదరసైనికుణ్ణి కాపాడుతూ ఆజర్మన్ మీద కాల్పులు సాగించాడు ఒక సోవియట్ యోధుడు. జర్మనీవాడు హతమయ్యాడు. ఆటాంకుకూడ చల్లబడింది. మళ్ళీ యింటిలోనే జర్మన్ పందులు పైనుంచి కాల్పులు సాగించాయి. ఆ యింటిగోడల యెర్రని యిటుకలు ఊడిపడటం ప్రారంభించినై. మన పరిశీలకుడు నాజీమారణ యంత్రాలు వుంచబడిన రహస్యస్థానాలను చెప్పాడు మన సైనికులకు. వెంటనే శిథిలగోడలవెనుక, కిటికీలవెనుక ద్వారాలవద్ద యిప్పటివరకు రహస్యంగా వుంచబడిన తుపాకులు ప్రేల్చ ప్రారంభించారు మన సైనికులు. ఈలోపున

యింకొకటి టాంకు నెమ్మదిగా వెనక్కు జారి కనుచూపు మేర లేకుండాపోయింది. అప్పటికప్పుడే టాంక విధ్వంసక శతఘ్నిసైనికుడు, సైన్యపరువగ్గరా సాయుధసైనికులు తమ స్థానాలనుమార్చి సరియైన స్థానాల్లో శత్రువుమీద దెబ్బ తీయటాని కనువైన స్థానాల్లో నిలబడ్డారు. యుద్ధోద్ధృతం తగ్గే సమయాల్లో యిలాగే జరుగుతుంటుంది చెదురుగా.

తుపాకిగర్జనలు, బాంబులమంటమధ్యనున్న ఆనగరం నరకసదృశ్యంగా వుంది. ఇప్పుడు ఆనగరంలో జీవితం మహా దుర్భరంగా వుంది.

పెన్సిల్‌తో వ్రాయబడిన నోటుపుస్తకంలోని ఒక కాగితం నాకు దొరికింది. అది తీసిచూస్తే కంపెనీఅధికారదళముఖ్య కార్యస్థానంనుంచి వచ్చినవార్తలున్నయ్. ఇవీ ఆవార్తలు:

''సైము ఉదయం పదకొండున్నరగంటలు.

''గార్డుదళాలకు చెందిన మొదటి లెప్టినెంట్ ఫెడోసివ్

''ఆటోమాటిక్ రైఫిల్ దళాలతో మా కంపెనీదళాలకు వెనుకభాగాన్నుంచి వచ్చి ముట్టడించాలని శత్రువు మహా ప్రయత్నంచేస్తున్నాడు. కాని యిప్పటివరకు ఆ ప్రయత్నా లన్నీ విఫలమయినాయ్. గార్డులు తమ స్థలాలనుంచి ఒక అడుగైనా కదలటంలేదు. సైనికులు, సైనికాధిపతులు తమ వీరత్వాన్ని ప్రదర్శిస్తున్నారు. ఏమైనప్పటికీ శత్రువును లోపలికి రానీయకూడదనే పట్టుదలతో వున్నారు. సేనాధి పతి బ్రతికున్నంతవరకూ శత్రువు పురోగమనం కలలోని వార్త. మూడోరైఫిల్ కంపెనీ సైనికులకీర్తి అమరత్వం

చెందుతుంది. మూడో రైఫిల్ కంపెనీ సేనాధిపతి ప్రమాదంలో వున్నాడు. అతడు చెవిటివాడయ్యాడు. దుర్బలుడయ్యాడు. అతనికి తల తిరిగిపోతున్నట్లుగా వుంటుంది. ముక్కునుంచి రక్తం ప్రవాహంగా కారుతోంది. అయినా అచంచలంగా నిలబడిపోరాడుతున్నాడు. ఇన్నికష్టాల్లోకూడా ఆకంపెనీసైనికులు ఒక్క అంగుళమైనా కదలటంలేదు. మేము చివరిప్రాణబిందు పోయేదాక స్టాలిన్ నగరాన్ని రక్షిస్తాం. సోవియట్ భూమిని శత్రుగోరీల దొడ్డిగా మారుస్తాం. నాకు సైనికులమీద. క్రింది అధికారులమీద అంతే నమ్మకం వుంది''

ఈమహానగరం పతనం కాలేదు.

ఫిరంగిగుండ్లమ్రోతలకు భూమ్యాకాశాలు దద్దరిల్లిపోయినాయ్. రెండునెలలనాడు వున్న ఉధృతం యింకా ఏమీ తగ్గలేదు. స్టాలిన్‌గ్రాడ్ నగరప్రజలలో మనోనిబ్బరం ఏమీ చలించలేదు. గోర్కీ, ఊరల్, మాస్కో, ఇవనోవో మొదలైన ప్రాంతాలనుంచి వచ్చిన వేలకొలది సైనికుల పట్టుదలకూడ ఏమీతగ్గలేదు. పోగా వీరి అకుంఠిత కార్యదీక్ష జర్మను ముష్కరుల్ని గడగడ లాడించింది.

శిథిలమైనప్పటికీ స్వేచ్ఛాప్రియులతో ఆ మహానగర ఇంతకుముం దెప్పుడూ లేనంత శోభాయమానంగా ఉందిప్పుడు. స్టాలిన్‌గ్రాడుప్రజలు పోరాడుతారు యింకా. స్టాలిన్‌గ్రాడ్ పునరుజ్జీవింపబడుతుంది.

ఏమైనాసరే స్టాలిన్‌గ్రాడ్‌నురక్షించండి! (స్టాలిన్‌గ్రాడ్ రక్షకులను జారిట్సిన్ నగరరక్షకులకు మనవి.)

[1918లో జారిట్సిన్ నగరాన్ని (ఇప్పటి స్టాలిన్‌గ్రాడ్) తమ అకుంఠిత ధైర్యసాహసాలతో రక్షించిన స్టాలిన్‌గ్రాడ్ పురప్రముఖులు స్టాలిన్‌గ్రాడ్ జర్మనీ దాడినుంచి కాపాడుతున్న ఎర్రసైన్యం సేనాధిపతులకు, రాజకీయబోధకులకు యీ క్రిందిలేఖను అందజేశారు.]

స్టాలిన్‌గ్రాడ్ నగరవీధులన్నీ అసంఖ్యాకములైన తుపాకి గుళ్ళతోను, బాంబుల ప్రేలుళ్ళతోను మార్మ్రోగుతున్న యీనాడు, ఒకనాడు జారిట్సిన్ నగరాన్ని శత్రువు ఆక్రమణ బారినుంచి కాపాడిన, మా హృదయాలు అప్రయత్నంగా పూర్వ యుద్ధదృశ్యాలవైపుకు పరిగెత్తుతున్నై. ఈ నాటి లాగనే ఆ నాడుకూడ మన ప్రియతమమైన యీ నగరాన్ని స్టాలిన్ నాయకత్వాన రక్షించికొన్నాం.

ఆ రోజులు గతించిపోయినప్పటికీ ఆ నాటి కీర్తి యింకా సజీవంగానే ఉన్నది. ఆ నాటి వీరులగాథలు కొన్నివందల గ్రంథాల్లోనూ, అనేక సినిమాల్లోనూ, చిత్రాల్లోనూ, జానపదగేయాల్లోనూ, ఇతిహాసాల్లోనూ చిత్రించబడ్డాయి. తమకోసం, తమ నగరంకోసం పోరాడి కీర్తిగాంచిన ఆ నాటి వీరులు స్టాలిన్‌గ్రాడ్ ప్రజల మనోవీధుల్లో నక్షత్రాలల్లా ప్రకాశిస్తున్నారు. ఆ నాడు ఎందరో వీరులు మరణించారు. కాని వారిని మన నగరస్త్రీ, పురుషు లెవ్వరూ మరచిపోలేరు.

మనం విజయాన్ని సాధించినతర్వాత ప్రశాంతముగా నగరనిర్మాణం గావించాం. మనం చూస్తుండగానే జారి

టిస్ట్ స్టాలిన్‌గ్రాడ్ మహానగరంగా పెరిగింది. మన జీవితానందానికి తోడ్పడడానికి అనేక యంత్రాగారాలు, పాఠశాలలు, కళాశాలలు, నృత్యశాలలు, సినిమాహాళ్ళు, విశ్రాంతిమందిరాలు, వైద్యశాలలు నిర్మింపబడ్డాయి. మేము మహానగరపౌరులమైనందుకు ఎంతో గర్విస్తున్నాము. అంతేకాదు. జారిట్సిన్ రక్షకుల వీర రక్తం వృథాపోలేదని కూడ అమితానంద పరవశులౌతున్నాం. అందువల్లే—వందలాది శత్రురాబంధులు మన నగర ఆకాశంలో తిరుగుతున్నప్పటికి, వేలకొద్దీ బాంబులు అగ్నివర్షాన్ని కురిపిస్తున్నప్పటికీ, ఆ బాంబుమంటలకు కూలిపోతున్న ఇళ్లక్రిందపడి మా భార్యాబిడ్డలు ఘోరమరణాల పాలౌతున్నప్పటికీ మేము మీకు—స్టాలిన్‌గ్రాడ్ రక్షకులకు—ఈ మాట యిస్తున్నాం.

సోదరులారా!

మన ప్రియమైన నగరాన్ని శత్రువుకు స్వాధీనంకానీయవద్దు! ఏమైనాసరే, నగరాన్ని వదలవద్దు. జారిట్సిన్ వీరుల కీర్తి నలుదిక్కుల మార్మోగుతున్నట్లే మీకీర్తికూడ తరతరాలుగా మార్మోగేటట్లుగా పోరాడి జయించండి.

మీ బిడ్డలు, మీ సోదరులు ఎప్పుడూ మిమ్మల్ని మరచిపోరనేసంగతి గుర్తించుకోండి! వారి భవిష్యత్సుఖంకోసం వీరోచితంగా తమ ప్రాణాలొడ్డి స్టాలిన్ నగరాన్ని కాపాడిన మిమ్మల్నెప్పుడూ విస్మరించరు! ప్రియసోదరులారా, ఈ విషయాన్ని గుర్తించుకోండి!

మీ శక్తినంతటిని కేంద్రీకరిస్తేచాలు శత్రువుకు పరాజయం సిద్ధమని మాకు గట్టినమ్మకం. రష్యా రాక్షసిముందు అల్పజర్మన్ కీటకమెంత? సోవియట్ ప్రజలందరి హృదయాలు మీ విజయంకోసం ఆరాటపడుతున్నై. వారి బల సంపదంతా మీ వెనుకనేవుంది. సోవియట్ ప్రజలంతా మీరు తప్పక నగరాన్ని కాపాడతారని గట్టిగానమ్ముతున్నారు. మీ విజయమే అఖిలసోవియట్ ప్రజలవిజయం.

ఆ ఫాసిస్టుతొత్తులకు యే మాత్రంస్థానం యివ్వవద్దని మీ ప్రజలందరూ ఎలుగెత్తి చాటుతున్నారు. రష్యన్ ప్రజలకు ఆ దుర్మార్గులుచేసిన ఘోరాపచారాలకు-వాళ్లకు శిక్ష మరణమే! మీదగ్గరదాకా వచ్చేవరకూ మీరు ఆగవద్దు. ప్రతియింట్లోనూ చొరబడి వేటాడి పిచ్చికుక్కల్ని చంపినట్లుగా చంపండి. మీరు చంపే ప్రతి జర్మను కీటకం, ప్రతిటాంకు, ప్రతితుపాకీ నాశనం మన విజయాన్ని దగ్గరకు తీసుకొస్తుందనే సంగతిని మర్చిపోకండి.

అతిత్వరగా ముందుకు వెళ్ళండి. మీ ఆయుధాల్ని గట్టిగా పట్టుకోండి! మీలో శత్రువిద్వేషానలాన్ని యింకా రగిల్చండి. మీకు విజయం లభ్యమౌతుంది.

స్టాలిన్ నాయకత్వంక్రిందే లాంట్సెన్ విజయం సాధించింది. మళ్లీ యీనాడు కూడ స్టాలిన్ నాయకత్వంక్రిందే స్టాలిన్‌గ్రాడ్ విజయాన్ని సాధిస్తుంది.

సెప్టెంబరు 28, 1942

# స్టాలిన్‌గ్రాడ్ రక్షకుల ప్రతిజ్ఞ

[25వ అక్టోబరు సోషలిస్టు విప్లవ దినోత్సవం నాడు స్టాలిన్‌గ్రాడ్ రంగంలోని ఎర్రసేన సైనికులు, సేనాధిపతులు, రాజకీయ బోధకులు కలిసి స్టాలిన్‌కు యీ క్రింది వుత్తరాన్ని వ్రాశారు.]

ప్రియమైన జోసెఫ్ విస్సరినోవిచ్!

ఇరవై ఐదు సంవత్సరాల క్రితం బోల్షివిక్ పార్టీ నాయకత్వాన సోవియట్ యూనియన్ ప్రజలు, పెట్టుబడిదారి, భూస్వాముల ప్రభుత్వాన్ని కూలద్రోసి, కార్మిక, కర్షక రాజ్యాన్ని స్థాపించారు.

అప్పటినుంచి ఒకటి, రెండు సార్లు మన ప్రజలు సాయుధులై ప్రజారాజ్య స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలను కాపాడారు.

మళ్ళీ ప్రతిభావంతమైన యీ 25వ విప్లవ విజయోత్సవం నాడు సోవియట్ ప్రజలు తమ దేశరక్షణకై జర్మనీ దురాక్రమణదారులతో హోరాహోరీ పోరాడుతున్నారు.

ఈవిషమ పరిస్థితుల్లో స్టాలిన్‌గ్రాడ్‌ను కాపాడుతున్న మేము సేనాధిపతి, గురువు, స్నేహితుడవు అయిన నీకు మా హృదయ పూర్వక సైనిక ఎర్రసేన అభివందనాలను పంపుతున్నాం.

రష్యా మహానది వోల్గానది ఒడ్డున తుపాకిగుళ్ళ హోరులో, బాంబుమంటల మధ్యనుంచి—మహాసంగ్రామ

మధ్యనుంచి నీ కీజాబు వ్రాస్తున్నాం. ఈ వుత్తరం ఎందు కంటే — నీకూ, నీద్వారా సోవియట్ ప్రజలకు మేము అంచంచలమైన పట్టుదలతో పోరాడుతున్నామనీ, శత్రు విధ్వంసక కార్యాలలో మా చేతులకు అలసట అనేదిలేదనీ తెలిజేయటానికి, మేము స్టాలిన్ గ్రాడ్ నగరంలో విజయమో, వీరమరణమో, రెండే మార్గాలని నిశ్చయించుకొన్నాం!

యూరప్ అన్ని మూలలనుంచీ వందలాది ప్రత్యేక దళాలను (Reserve Forces) వేలకొలది టాంకులు, విమానాలను స్టాలిన్ గ్రాడ్ వద్ద కేంద్రీకరించి అప్పుడే రెండు నెలలైంది, మహానగారాన్ని స్వాధీనంచేసుకొని వాల్గానదిని ఆక్రమించుకోవటానికి.

శత్రువు ఎత్తులన్నీ మాకు తెలుసు. స్టాలిన్ గ్రాడ్ ను స్వాధీనపరచుకొని వాల్గానదిద్వారా మనకువస్తున్న సరఫరాలను అరికట్టి నదివెంట దక్షిణంగాపోయి కాస్పియన్ సముద్రందగ్గర మన ముఖ్య నూనె నిల్వ కేంద్రాలను పట్టుకొని ఆర్థికంగానూ, సైనిక యెత్తుగడలతోనూ సోవియట్టు రాజ్యాన్ని ఆక్రమించుకోవాలని శత్రువుకుట్ర. ఇలావున్నై శత్రువు యెత్తులు!

శత్రువు యెత్తులు విజయవంతం అయినట్లైతే మన రాజ్యానికి గుండెకాయలైన లెలిన్ గ్రాడ్, మాస్కో లపై వెంటనే కాకసస్సులోనుంచి ముట్టడి జరుపుతారు.

మేము యీనాడు ఒక్క స్టాలిన్ గ్రాడ్ కోసమే కాదు యీ యుద్ధాన్ని చేస్తున్నది.. ఏది లేకపోతే జీవితం దుర్భర

మాతుందో అట్టి స్వాతంత్ర్యాన్ని మన ప్రియ మాతృభూమిని కాపాడటానికి యీ యుద్ధం చేస్తున్నాం. ఇక్కడే మన దేశ భవిష్యత్తు నిర్ణయించబడుతోంది. ఇక్కడే మనం స్వతంత్ర జాతిగా వుండేదీ లేనిదీ నిర్ణయించబడుతుంది.

అందుకోసమే మేము మా సర్వశక్తులన్నీ ధారపోసి పోరాడుతున్నాం. మా చివరి ఉచ్ఛ్వాసము ఊపిరితిత్తుల్నించి పోయే వరకు పోరాడతాం. మాలో అందరూ ఒక్క అంగుళమైనా వెనక్కు తగ్గకూడదని నిర్ణయించుకొన్నారు.

యుద్ధరంగ సమీపంలోనే పల్లెప్రాంతాలకు వెళ్ళినప్పుడు అక్కడి ప్రజలు మమ్మల్ని యెంతో ప్రేమతో, ఆశతో చూచారు. ఆ చూపులు ఎలాగైనా జర్మనీ నరహంతకుల్ని ముందుకు రానీయమనీ, తాము యింతకాలంగా అనుభవిస్తున్న సౌఖ్యప్రదమైన జీవితాన్ని వదలి దుర్భరజీవితాలను గడపలేమనీ తెలియజేస్తున్నాయి. వారు సేద్యంచేసి పండించిన పంటభూముల్ని యీ మురికి జర్మనీ కుక్కలు తాకలేవనే ధైర్యంతో వున్నారు.

ఆక్రమిత ప్రాంతాల్లో జర్మనీవాళ్ళు చేస్తున్న రాక్షస కృత్యాలన్నిటినీ జర్మనులనుంచి తప్పించుకొనివచ్చిన ప్రజలు మాకు వివరించేవారు మా దళాల్లో కలిసి పోతున్నారు, జర్మనీ ఆక్రమణక్రింద అణగారిపోతున్న రష్యన్, యుక్రేనియన్, బైలో రష్యన్ వగైరా రాష్ట్రాల సోదరుల ఘోషను మేము స్పష్టంగా వింటున్నాం. ఆక్రమితప్రాంతాల్లోని మన తల్లులు, భార్యలు, అక్కచెల్లెళ్ళ కన్నీరు సము

ద్రాలుగా ప్రవహిస్తోంది. అయినప్పటికీ వారికొక ఆశవుంది. మనబలంలో పూర్తి నమ్మకము, మనకుతప్పక యెప్పటికైనా విజయం కలుగుతుందనే ఆశలు వారికి మెండుగా వున్నై. అవే వారిని యింకా బ్రతికిస్తున్నై అన్ని కష్టాలలోగూడ.

జర్మనుల చేతి యమబాధ ననుభవిస్తున్న మన ప్రియ బాంధవులు, నిరాశతో కృంగిపోయిన మనసోదరులు మనల్ని ప్రేమాతిశయాలతో కౌగలించుకొనురోజే మనకు శోభావంతమైనరోజు.

అదిగో! మన తల్లులు శుష్కహస్తాలు, బిడ్డలు చిన్న కోమల హస్తాలు మనకోసం చాచి యెదురుచూస్తున్నారు. లక్షలాది మన సోదరులు "రండి త్వరగా, రక్షించండి"! అనేహృదయ విదారకమైన ఆర్తనాదాలు స్పష్టంగా వినిపిస్తున్నై.

అందువల్ల శత్రువును ఓడించటమేకాదు. సోవియట్ భూమినుంచి తరిమి, మనదేశాన్ని ఫాసిస్టు బారినుండి తప్పించటం మావిధి అనుకొంటున్నాం. ఈ నిర్ణయమే యీపట్టుదలతోనే మేము రోజూ యుద్ధానికి వెళ్లుతున్నాము. ఈ నిశ్చయంతోనే శత్రువును హతమారుస్తున్నాం.

మేము అతిపట్టుదలతో పోరాడుతున్నాం. శత్రువు రోజు రోజుకు ఉద్రిక్తుడై ఘోరంగా పోట్లాడుతున్నాడు.

ప్రతిరోజూ కొన్ని వేల శత్రువిమానాలు మాపై నవిహారం చేస్తుంటాయ్. కొన్నివందలటాంకులు నగర అన్ని మూలల

నుంచి కాల్పులు సాగిస్తున్నయ్. అసంఖ్యాకములైన తుపాకులు, కొండక మోర్టార్లు ఎడతెగకుండా మా స్థానాలపై అగ్నివర్షం కురిపిస్తుంటై.

జర్మనులు బాంబుల ప్రేలుళ్ళతో మమ్మల్ని నిర్ఘాంత పట్టాలని చూస్తుంటారు. అగ్నిమంటలతో మమ్మల్ని గుడ్డి వాళ్ళగాచేసి ముట్టడించాలని ప్రయత్నిస్తుంటారు. మా దృఢ సంకల్పాన్ని సడలించాలని వాళ్ళుద్దేశం. కాని మన వీరయోధులు అచంచలంగా, అకుంఠిత ధైర్యసాహసాలతో నిలబడి పోరాడుతున్నారు. స్టాలిన్‌గ్రాడ్ రక్షకులముందు జర్మనుల దారుణ రాక్షస కృత్యాలు నేమీ పని చేయటంలేదు.

మొదటిసారి బాంబులకాల్పులు అయినతర్వాత జర్మనులు 70 టాంకులతోనూ, కొంత కాల్బలంతోనూ వచ్చి పదిగురు ఎర్రసైనికులున్న ప్రదేశంమీద దాడి ప్రారంభించారు. ఈ ఫాసిస్టురాక్షసులు ఆ కొద్దిమంది వాళ్ళతుపాకుల మారణ అగ్నిజ్వాలలకు బలికావించాలని బయలుదేరారు.

కాని ఆ వీరరక్షకులు ఏమాత్రం చలించలేదు. విజయాన్ని సాధించారుకూడా. ఈ అసాధారణ పోరాటంలో 27 శత్రుటాంకుల్ని కాల్చివేశారు. 150 హిట్లరు జంతువుల్ని కూడా కాల్చారు, దాడిని తిరగగొట్టారు. హతశేషులు టాంకులు తోకలు ముడిచి కాళ్ళకు బుద్ధిచెప్పారు. జర్మనీ ఉక్కుకంటె మన సోవియట్ సైనికుల మనోబలం ఎంతో గొప్పదో ఈ చిన్నపోరాటం రుజువుచేసింది.

జూనియర్ లెఫ్టినెంట్ కలాష్నికోవ్ ఆధిపత్యంకింద వున్న ఒక చిన్నదళంమీదకు కందక మోర్టారుల బలంతో కూడిన రెండు జర్మను పెద్దదళాలు దాడిసలిపినై.

వాళ్ళను బాగా దగ్గరకు రానిచ్చి అప్పుడు ఆటోమాటిక్ రైఫిళ్ళతో వాళ్ళను తుడిచిపెట్టమని కలాష్నికోవ్ ఆజ్ఞ యిచ్చాడు. గట్టిదెబ్బ తగిలింది వైరివలకి. చావగా మిగిలిన కొద్దిమంది వైరివలు వెనక్కు తిరిగైనా చూడకుండా పారిపోయారు.

మరునాడు ఉదయమే మళ్ళీ దాడి ప్రారంభమయింది. ఈసారి 500 మందితో వచ్చారు. దగ్గరదగ్గరగా వుండి ఎడతెగకుండా కాల్పులు సాగిస్తూవచ్చారు. యీ దళాల రక్షకులు ఒక్కొక్కరే వాళ్ళపెద్దలదగ్గర కెళ్ళారు. చివరకు 11 మంది మాత్రమే మిగిలారు. ఆ 11 గురు స్టాలిన్‌గ్రాడ్ రక్షకులే! ప్రతివిషమఘట్టంలోను కలాష్నికోవ్ "సోదరులారా! స్టాలిన్‌గ్రాడ్ వీధుల్లోనే పోరాడుతున్నామనే సంగతి మర్చిపోకండి. మనం స్టాలిన్‌గ్రాడ్ పౌరులమేనని జ్ఞాపకముంచుకోండి" అని హెచ్చరిస్తూవుండేవాడు.

ఈసారికూడ శత్రువును తరిమారు మన వీరులు. ఈ కలాష్నికోవ్ చిన్నదళం మనోనిబ్బరాన్ని చెదరగొట్టాలని భయంకరమైన కాల్పుల్ని పెద్దయెత్తున సాగించారు జర్మనులు. కాని యీ ప్రయత్నంకూడ విఫలమైంది. ఈ 11 మంది వీరులమీదకు 40 బాంబువిమానాలను పంపారు. ఆ బాంబుమంటల ఉధృతంచూస్తే ఆకాల్పుల తర్వాత యింకా అక్కడ యేమీ ఉండదనిపించింది.

ఈ జర్మనులదాడి వచ్చేటప్పటికి ఆటోమాటిక్ రైఫిళ్లు తమ శక్తిని పూర్తిగ చూపించినై. జర్మను నక్కలక. గాయపడిన, పడని ప్రతిసైనికుడు తనకందకంనుంచి కాలుస్తూనేయున్నాడు. చివరకు మళ్ళీ సహాయదళాలు వచ్చేటప్పటికి జర్మనుసైనికులు, అధికారులు బజారులలో కుప్పకుప్పలుగ దీర్ఘనిద్రలు పోతున్నారు.

స్టాలిన్‌గ్రాడ్‌లో ఒకవీధిని సంరక్షిస్తున్న సర్జంట్ మేజరు ఖోస్టిన్‌సెవ్‌కు 6 జర్మనుటాంకులు వస్తున్నై. అతడు టాంకువిధ్వంసక శతఘ్నిని ప్రయోగించి మూడు టాంకుల్ని నామరూపాలులేకుండా చేశాడు. ఈ కాల్పుల్లో అతనివద్దనున్న గుళ్ళన్నీ అయిపోయినై. మిగిలిన మూడు టాంకులు పైకివస్తున్నై. వెంటనే దొరికిన టాంకువిధ్వంసక రైఫిలును ప్రయోగించి యింకోటాంకును నాశనం చేశాడు. మృత్యుఘోషతో మిగిలిన ఆరెండుటాంకులు అతివేగంగావస్తున్నై. ఇంక యితనికి ఆయుధాలేమీలేదు. కాని నిరుత్సాహ పడలేదు. గ్రెనేడుతో ఒకటాంకు ముందుచక్రాలను విరుగగొట్టాడు. ఇంక ఒక్క ఒక్క చేతి గ్రెనేడు మాత్రమే వుండతనివద్ద. మిగిలిన ఆ ఒక టాంకు నగరంలోనికి పోవటానికి బయలుదేరుతోంది. దానిని ఎలాగైనా ఆపాలని అతను చేతి గ్రెనేడును తన గుండెల కదుముకొని టాంకుకు అడ్డపడ్డాడు.

వీరుడు వీరస్వర్గ మలంకరించాడు. టాంకు ఆగిపోయింది. ఈ విధంగా మా ప్రియతమమైన నగరాన్ని ప్రాణాలుకూడ ఒడ్డి యిప్పటికి రెండు నెలలనుంచి కాపాడుకొంటున్నాం.

'ఏమైనా సరే స్టాలిన్‌గ్రాడ్ వద్ద శత్రువును తరిమాలి' అనేదే మాయుద్ధ నినాదం యీనాడు. ఈనినాదం విజయవంతంగా సాధించబడాలంటే పట్టుదల, శిక్షణ కావాలి. విధ్వంసకులు, పంచమాంగదళంవాళ్లు, పిరికిపందలు ప్రచారంచేసినట్లుగా - భూతాలకంటె భయంకరమైనవాళ్లు జర్మనులు-శత్రువు అంత బలవంతుడు కాదని ప్రతిదినం మా అనుభవం మాకు ఎంతో ధైర్యాన్నిస్తోంది.

కామ్రేడ్ ! మాకోసం నీవు పడుతున్న ఆతురత, యీ నగరయుద్ధానికి నీనాయకత్వంవల్ల యిక్కడి ప్రతి అంగుళాన్ని పట్టుదలతో రక్షిస్తున్నాం. ఈ మంటల మధ్యకూడా రోజురోజుకు మాకు ఉత్సాహం, పట్టుదలలు యెక్కువౌతున్నయ్. అతినైపుణ్యంతో యుద్ధముచేస్తున్నాం. బలవత్తరమైన రక్షణశ్రేణుల్ని నిర్మించ గలుగుతున్నాం. ఇక్కడ స్టాలిన్‌గ్రాడ్ వద్ద, మరొకసారి జర్మనులు మన తడాకా రుచిచూస్తారు.

ఇక్కడ, స్టాలిన్‌గ్రాడ్ వద్ద, జర్మనుల గర్వం అణగింది. స్వాతిశయం సడలింది. మొన్న జూలై దాక జర్మనులు మూడురోజుల్లో స్టాలిన్‌గ్రాడ్‌ను పట్టుకొంటామని ప్రగల్భాలు కొట్టారు. అప్పటినుంచి స్టాలిన్‌గ్రాడ్ ఆక్రమణకు వాయిదాలువేస్తూ హిట్లరు మొరుగుతున్నాడు. గోరింగు గురకలు పెడుతున్నాడు. గొబ్బెల్సు కీచుగొంతుకతో అరుస్తున్నాడు. కాని ఆ వీరనగరం. చలించకుండా వుంది. ఫాసిస్టు పశువులు వేసే ప్రతి అడుగూ వాళ్ళ రక్తప్రవాహంలో పడుతోంది.

జర్మనులు స్టాలిన్‌గ్రాడ్‌కి బాట వ్యాసోగ్రాలు అని వారికే అన్నారా?

యూరోపులోని అన్ని రంగాలనుంచి తనకున్న అత్యుత్తమ సైనిక దళాలను తెప్పించి ఇక్కడ కేంద్రీకరించాడు హిట్లరు. కాని ఈ రెండు నెలల్లోనూ లక్షమంది జర్మను, ఇటాలియన్, రుమేనియన్ సైనికులు స్టాలిన్‌గ్రాడ్ ముట్టడిలో హతులైనారు.

హిట్లరు వందలాది టాంకుల్ని పంపాడు. కాని టాంకులు కూడా ఏమీ చేయలేక పోయినై. స్టాలిన్‌గ్రాడ్ నగర వీథుల్లో గోడలప్రక్కనే 800 టాంకుల విధ్వస్త ఇనుప ముక్కల్ని పోగుచేసి వుంచాము.

ఇంతకు ముందెప్పుడూ ఉపయోగించని యంత్రాల్ని ఉపయోగిస్తున్నారు జర్మనులు ఇక్కడ. అయినా ఏమీ ప్రయోజనం కనుపించటంలేదు. మన విమానవిధ్వంసక శతఘ్నుల సైనికుల నేర్పరితనంవల్ల 1002 జర్మను విమానాలు ముక్కలుముక్కలై వాల్గానది ఒడ్డున బహిరంగ ప్రదేశాల్లో గుట్టలు గుట్టలుగా పడివున్నై.

ప్రియమైన జోసెఫ్ వాస్సిరినోవిచ్!

మేము విశాలమైన రష్యా మాతృభూమి అన్నిప్రాంతాల నుంచీ వచ్చాం.

సోవియట్ ప్రజలందరికీ గర్వకారణమైన స్టాలిన్‌గ్రాడ్ నగరాన్ని రక్షించటంకోసం, వివిధజాతుల సమ్మిళితమైన మన మాతృభూమినుంచి అన్ని జాతుల సోదరులం ఒకే

యుద్ధజాతి కుటుంబంలాగ, శత్రువుయందు పూర్తి ద్వేషంతో, అందరం సమాన ధైర్యసాహసాలతో యిక్కడ పోరాడుతున్నాం. ఈ నగరంకోసం యింత పట్టుదలతో యెందుకు పోరాడుతున్నామంటే ఎర్రసేనకు, ప్రజలకు యీ నగరం యెంత ప్రాముఖ్యమైనదో మాకు తెలుసు గనక.

ఈ నగరాన్ని కాపాడుతున్నప్పుడు మొట్టమొదటి స్టాలిన్ పంచవర్ష ప్రణాళిక ప్రకారం, ఎండ తీవ్రతను, చలిబాధను, నిద్రలేమిని, అర్ధాకలినికూడ లెఖ్ఖచేయకుండ, సోవియట్ ప్రజలందరికి గర్వకారణమైన, స్టాలిన్ ట్రాక్టర్ యంత్రాగారాన్ని యీ నగరంలోనే నిర్మించామనే సంగతి జ్ఞాపకమొస్తుంది.

జర్మనులు స్టాలిన్‌గ్రాడ్ సుందర భవనాలను నాశనం చేశారు. ఫ్యాక్టరీలను కూల్చివేశారు. కాని శిథిల నగరమైన స్టాలిన్‌గ్రాడ్ అజేయంగావుంది. ఆబూడిద, శిథిలాలు, చివరకు యిటుకలుకూడ మనకు పవిత్రాలు.

జారిట్సిన్ రక్షణ రోజుల్లోలాగే స్టాలిన్‌గ్రాడ్ నగర యంత్రాగార కార్మిక సోదరులు మాతోపాటు నిలిచి నగరరక్షణకు పోరాడుతున్నారు. మాలో చాలమంది జారిట్సిన్ నగరయుద్ధంలో పాల్గొన్న అనుభవశాలులు వున్నారు. నీవు ఆనాడు నగరరక్షణకు ప్రదర్శించిన అద్భుతమైన ధైర్యసాహసకృత్యాలను వర్ణిస్తూ నగరాన్ని యెలా కాపాడవో చెప్తూంటారువారు. ఈకథలు మాకు నూతనోత్సాహాన్నిచ్చి కార్యోన్ముఖుల్ని చేస్తుంటాయి.

మా వైపుకు ప్రసరింపజేస్తున్నారు. మాకు వేలాది ఉత్తరాలు సోవియట్ యూనియన్ అన్నిప్రాంతాలనుంచి వస్తూవుంటాయి. ప్రతి ఉత్తరంలోనూ "స్టాలిన్‌గ్రాడ్ శత్రువు స్వాధీనం కాగూడదు" అనే ఆజ్ఞాపూరితవాక్యాలేవుంటాయి.

మన దేశపు ప్రతి కార్మికుడూ, ప్రతి కార్మిక స్త్రీ—యెక్కడున్నాసరే, ఏపని చేస్తున్నా—వారి సర్వశక్తుల్నీ వినియోగించి పాటుపడుతున్నారు. వారు పంపే ప్రతి అదనపు విమానం, టాంకు, తోటాలు, గుళ్ళు, రొట్టెలు, ఆహార పదార్థాలు శత్రువిధ్వంసనకు ఎక్కువగా ఉపయోగపడతాయని వారికి తెలుసు. మాకున్న యీ ప్రజాబలమే మాలోని శక్తిని సహస్రాంశాలు అధికంచేసి మా దేశరక్షణబాధ్యతల్ని యెక్కువగా గుర్తింపచేస్తోంది.

ఒక సోవియట్ ప్రజలేకాదు, యావత్ప్రపంచంకూడ యీ నగరయుద్ధంవైపే తన దృష్టిని నిగిడ్చి చూస్తోంది. ప్రపంచం మారుమూలలనుంచికూడ మన మిత్రులు మన యుద్ధవిధానాన్ని శ్లాఘిస్తున్నారు. యీ నైతికబలసహాయం మన మిత్రమండలి రెండోరంగం ప్రారంభించే రోజు యింకా యెంతోదూరం లేదనిపిస్తోంది.. ఇది నైతికబలసహాయమే కాదు. నిజమైన సహాయమే స్టాలిన్‌గ్రాడ్ రక్షకుల కని చెప్పవచ్చు. శత్రుపరాజయాన్ని మరింత దగ్గరకు తీసుకొస్తుంది యీ సంపత్తి. విజయానంతరం మిత్రమండలి రాజ్యాలన్నీ కలసి పైశాచికఫాసిజం నామరూపాలులేకుండ చేస్తాయి:

ప్రియమైన జోసెఫ్ విస్సరినోవిచ్!

ఈ ఫాసిస్టుభూతాలు మన మాతృభూమిమీద దండెత్తకుండా వున్నట్లైతే ప్రశాంతంగా విశాలమై, శోభావంతమైన షాపులనుంచి, ఫ్యాక్టరీలనుంచి, సమిష్టి వ్యవసాయక్షేత్రాలనుంచి, విశ్వవిద్యాలయాలనుంచి, కళాశాలలనుంచి నీకు ఆనందంతో వుత్తరాలు వ్రాస్తుండేవాళ్ళంగదూ!

కాని యిప్పుడు మేము సైనికులం. ఇప్పుడు మాకర్తవ్యం ముఖ్యంగా, జర్మనీకి దాసులు కాకుండా మన దేశప్రజల్ని కాపాడటంకోసం విజయసాధన.

మా కందకాలనుంచి ఈ వుత్తరంలో నీకు ప్రతిజ్ఞ చేస్తున్నాం: మా చివరి రక్తపుబొట్టు క్రిందపడి ఎండిపోయేవరకు, మా హృదయస్పందనం ఆగిపోయేవరకు, మా చివరి నిశ్వాస బయటికి పోయేవరకూ స్టాలిన్‌గ్రాడ్‌కోసం పోరాడతాం. శత్రువు వాళ్ళను ఎన్నటికీ సమీపించలేదు.

జారిట్సిన్ రక్షకులగు, తల నెరిసిన అనుభవశాలురగు మా తండ్రులముందు యితరరంగాలలోనున్న మా కామ్రేడ్సుముందు, మా దళవర్గాలముందు, సోవియట్ మాతృభూమి ముందు సోవియట్ ప్రతిష్ఠకు కళంకం రానీయమనీ, చివరివరకూ పోరాడతామనీ ప్రతిజ్ఞ చేస్తున్నాం.

నీ నాయకత్వంక్రిందే మా తండ్రులు జారిట్సిన్‌ను కాపాడారు. మళ్ళీ యిప్పుడు నీ నాయకత్వంక్రిందే స్టాలిన్‌గ్రాడ్ మహాయుద్ధాన్ని గెలుస్తాం.

సోషలిస్టు అక్టోబరు విప్లవం వర్ధిల్లుగాక!

సోవియట్ యూనియన్ మాతృభూమి వర్ధిల్లుగాక!
సోవియట్ విజయనిర్మాత, స్టాలిన్ వర్ధిల్లుగాక!

నవంబరు 6, 1942 { స్టాలిన్‌గ్రాడ్ రంగసైనికులు, సేనాధిపతులు, రాజకీయబోధకుల సంతకాలు.

## Stalingrad Days

## 24 గంటలు

రచయిత:

—లియోనిడ్ కోరిన్.

ఆనాడు అతివిషమంగావుంది. 12 జర్మన్ దాడులు జరిగాయి. టాంకులతోనూ, విమానలతోనూ, అశ్విక దళాలతోనూ, కందకమోర్టారులతోనూ ఎడతెగని అగ్నిజ్వాలల్ని కురిపిస్తూ ఎలాగైనా నగరరక్షణ శ్రేణుల్ని ఛేధించాలని యీ పన్నెండు ప్రయత్నాలుచేశారు. ఒకరి తరువాత ఒకరికి విజయం. ఒక్కొక్కప్పుడు ముష్టియుద్ధంచేసేంతటి స్థితిలోనికి కూడావచ్చేది. మన సైనికులకు శత్రువు ఆయుధాలు, యుద్ధపద్ధతులు పూర్తిగ తెలుసు. విమానాల ఝుంకారాలకు, టాంకుల ఘళఘళారావాలకు, యేమీ భీతిచెందలేదు. వందలాది జర్మన్ రైఫిల్‌దళాలు గుంపులు గుంపులుగా లోపలికి చొచ్చుకువస్తున్నప్పుడైనా కించిత్తుచలించలేదు. సరిగదా ముందున్న శ్రేణులువెనక్కి, వెనకనున్న శ్రేణులు ముందుకు తారుమారైనప్పుడైనా కంగారుపడలేదు. వారు 'శ్రేణుల్ని వదలవద్దు' అనే ఆజ్ఞను మర్చి

పోలేము. అందువల్ల వారిని ఎదిరించి దేనిమీ లోపలికి పోలేము. ప్రతి యింట్లో ఒక దుర్గం, ప్రతి రాయీ ఒక రక్షణ గోడలాగ ఉన్నై.

శత్రువు వాయుదాడికి మన సైనికులు నేలకరుచుకొని పడుకొనివున్నారు. ఇంతలో 8 టాంకులు మంటల్ని కక్కుతూ ఒక కంపెనీ దళాలవైపుకు వస్తున్నాయి. వెంటనే మన సైనికులు మూడు విధ్వంస శతఘ్నుల్ని ప్రయోగించారు. కాని అవి ధ్వంసమయ్యాయి. మన సైనికులు చలించారు. ఇంతలో వాళ్ళ సేనాధిపతి, లెప్టినెంట్ బైబెకోవ్ శాంత వాక్కులు వినబడుతున్నై.

"ధైర్యంతో వుండండి! ఒక్క టాంకునైనా వెనక్కి అడుగేయవద్దు!"

వారు వెర్రి ధైర్యంతో రైఫిళ్ళు, చేతి గ్రెనేడ్లు పుచ్చుకొని సిద్ధంగా నిలబడ్డారు. శత్రు టాంకుల్లోనుంచి గుంపులు గుంపులుగా ఆటోమాటిక్ రైఫిలు దళాలు దిగి చుట్టూ పరిశీలించుకొంటూ కైఫీళ్ళు పేలుస్తూ వస్తున్నారు. వారి వెనుక వాళ్ళ టాంకులున్నై. ఒక శిథిలగృహంలో ప్రవేశించారు. ఆ యింటిగోడకు పెద్ద కంతపడింది. అందువల్ల ద్వారంనుంచే వెళ్ళ నక్కరలేకపోయింది. ఒక్కనిమిషం పాటు నివ్వెరపాటుతో నిలబడ్డారు జర్మనులు. కాని అంతా నిశ్శబ్దం. అతిజాగ్రత్తగా — మొదటివాడు — రెండోవాడు తరువాత మూడోవాడు — ఇంటిలో జొరబడ్డారు. ఆ ఇంట్లో వున్న యిరుకుమెట్లగుండా పైకియెక్కుతూ నిరుక్కున వెనక్కు తిరిగారు. అప్పటికప్పుడే ఆలస్యమయింది. వాళ్ళ

పాదాలదగ్గర గ్రెనేడులు ప్రేలాయి. అంతులో ప్రాణాలతో వున్న ఒక్కజర్మను కెవ్వున కేక వేసి బజారులోకి ఉరికాడు.

జర్మనుటాంకులు గురిచూచి కాలుస్తున్నయ్. ఇల్లు తగులబడిపోయింది. లెఫ్టినెంట్ బాబింకో తీవ్రంగా గాయపడ్డాడు. కాని స్మృతి తప్పిపోతున్నప్పటికీ "తుపాకులన్నిటినీ ప్రేల్చండి" అని కేక వేశాడు.

చేతి గ్రెనేడులు ప్రేలాయి. మరతుపాకులు గల్లంతు చేశాయి. ఆ యింటిరక్షకులు చివరిగోడ పడిపోయేవరకూ ఆ యింటిని వదలలేదు.

ఎక్కడికిపోతారు? పారిపోతారా? ఛీ! ఆపని చేయలేరు. వారి నాయకుని ఆజ్ఞప్రకారం రెండువైపులనుంచీ పోరాడుతున్నారు. తిరోగమనం అనేదిలేదు! వారికి ముందు 10 గజాల్లో ఒకయిల్లు పొగ కప్పివేసింది. దాన్ని జర్మనులు ఆక్రమించుకొనివున్నారు. రైఫిళ్లు సిద్ధంచేసుకొని, మరతుపాకి పుచ్చుకొని మనసైనికులు ఆ పొగలోనుంచి వెళ్ళారు.

ఎడమభాగాన కొంచెంలో 7వ కంపెనీ వుంది. అన్నివైపులనించి శత్రుటాంకులు ఆ వైపుకు వస్తున్నయ్. మన సైనికులు తమ తమ ఆయుధాలతో సిద్ధంగావున్నారు. టాంకువిధ్వంసక శతఘ్నులసైనికులు పొటెన్, సాడికోవ్, కెషిట్స్యన్ లు కాల్పులు ప్రారంభించారు. కాల్పుల ఉధృతం మూడుటాంకుల కాల్పులు అకస్మాత్తుగ ఆగిపోయినయ్. శత్రువు వెనక్కు తగ్గి ఎడమవైపుగా తిరిగివచ్చి చుట్టిముట్టటానికి టాంకుల్ని ముందుకు తెస్తున్నారు. టాంకు

విధ్వంసకతుపాకిల్ని మళ్ళీ ఒక్కొక్కదానిని పేల్చారు మనవాళ్లు. మొలొకోవ్, మార్కోవ్, అంటోనెస్కోల తుపాకులు రెండు ట్యాంకుల్ని తగులబెట్టినై. కాని ఇంకా అవి ముందుకు వస్తూనే ఉన్నై. ఆరు భయంకరమైన ట్యాంకులు మృత్యువును కురిపించినై. అంటోనెస్కో మరణించాడు. ట్యాంకు విధ్వంసకదళ నాయకుడు, తురంటయేవ్, అతని సైనిక మిత్రులు, జర్కోవ్, ఫెడరోవ్ పిమెనోవ్‌లు వెంటనే కందకాలంలోనికి వెళ్ళి వారి నియమితస్థానాల్లో ఉన్నారు. వారు నిశ్శబ్దంగా శత్రుగమనాన్ని పరిశీలిస్తున్నారు. 100 గజాల్లో ఉన్నాడు శత్రువు...... 80 గజాల్లో...... వెంటనే ఒకటి ...రెండు... మూడు గుళ్లు పేలినై. మళ్ళీ రెండోసారి కాల్పులు. ఆ కాల్పుల్లో ఏవో పగిలి ముక్కలైనధ్వని.

"ట్యాంకులు యెడమవైపున ఉన్నై" అన్న పిమెనోవ్ హెచ్చరికవాక్యాలు వినబడ్డయి. అతనే ముందుగా తన తుపాకీని పేల్చాడు. ఒకగుండు పేలింది. పిమెనోవ్ పడిపోయాడు. కాని తక్కిన తుపాకులన్నీ పనిచేస్తున్నై. మూడు జర్మన్ ట్యాంకులు మండిపోయినై. మిగిలిన వాళ్ళ గుండెలు బేజారెత్తి పలాయనం చిత్తగించారు.

మన కంపెనీకి సమీపంలో యిప్పుడు 8 ట్యాంకులు మండుతున్నై.

సంధిచీకటి పడుతోంది. జర్మన్ బాంబువిమానాలు ఆకాశంలో ఎగురుతున్నై. అలవాటుప్రకారం మంటలు కురిశాయి. మంటలు బాగా వ్యాపించాయి అన్నివైపులా. ఆ రాత్రి పట్టపగలులా వెలిగిపోతోంది.

ఇంకొక రోజు కూడ ఇలాగే గడిచింది. ఒకగంట మాత్రం తీవ్రంగా సాగింది పోరాటం.

రేడియో స్టేషను ఒక చిన్న వసారాలో ఏర్పాటు చేశారు. డివిజనల్ హెడ్‌క్వార్టర్సుకు, అశ్విక, కందక మోర్టారుదళ కేంద్రాలకు వార్తల రాకపోకలకు చాలమంది పనిచేస్తున్నారు. నిరంతరం వార్తా ప్రసారకయంత్రం మోత వినిపిస్తూ వుంటుంది. రేడియో ఆపరేటర్ల బండ గొంతు కలుకుండ అప్పుడప్పుడు వినిపిస్తుంటాయి.

"శాలేక్! శాలేక్! ఇది కుర్దక్! మన సమావేశం మళ్ళీ 8 ఘంటలకు. ఇది కుర్దక్ - గ్రాహక..."

మేమంతా అలసట తీర్చుకోవటానికి భూగృహంలో ఒక చోటకూడాం. అందరి ముఖాల్లోనూ అలసట కనిపిస్తోంది. కాని యెవ్వరూ నిద్రపోవటానికి తొందర పడటంలేదు. కోకుష్కిన్ ఒక చిన్నబల్లమీద కూర్చుని నెమ్మదిగా పాట ప్రారంభించాడు.

"పంథొమ్మిదవ రక్షకదళం
ఇప్పుడే నాకుటుంబం
ప్రియ సోదరులారా! మన పిల్లలు
వారి ప్రేమాభి వందనాలు పంపుతున్నారు."

మేమందరం కూడ పాల్గొన్నాం. ఆ భూగృహం నూత్న శ్రావ్య గానానికి ప్రతిధ్వనించింది.

## పార్టీ బ్యూరో సమావేశం

రైలుకట్టకు కుడివైపుగా ఒకసన్నని దారి ఉంది. ఆదారి వెళ్ళివెళ్ళి ఒక చిన్న గోరీదగ్గర ఆగింది. అక్కడ కందక మోర్టారులు గోరీకి చుట్టూపెట్టి ఉన్నై. కమ్యూనిస్టు-పార్టీబ్యూరో సమావేశానికి వచ్చాం యిక్కడికి.

ఆబ్యూరో కార్యదర్శి కామ్రేడ్ విరిగిపోయిన మందు గుండు పాకాను పెట్టెమీద కూర్చొని ఒక దరఖాస్తు పత్రాన్ని పూర్తి చేస్తున్నాడు.

“ఇంటిపేరు—బెలిసోల్. పేరు, తండ్రి పేరు - పావెల్ మిఖైలోవిచ్. పుట్టినతేది - 1917...”.

ఇవి, కార్యదర్శిముందు కూర్చున్న విశాలమైన భుజాలను గలిగివున్న ఒక పొడుగుపాటి యువక సేనాధిపతి వివరాలు. అతనిముఖం గాలిదెబ్బతిని వడలిపోయినట్టు కనుపిస్తోంది. కాని చిరు నవ్వుతో అప్పుడప్పుడు కళ్ళుతుడుచుకొంటున్నాడు.

“కొద్దిగా దుమ్ముపడింది కళ్ళల్లో” అని చెప్పాడు. “మన కాల్పుల్లో శివమెక్కింది వాళ్ళకు. మనకు ఎక్కువనష్టం చేయలేక పోయారు. మన కందక మోర్టారులు బాగా పని చేసాయి...” అని వెనక్కు తిరిగిచూచాడు.

అక్కడే ఒక పదిగజాల దూరంలో అతని కందక మోర్టారులున్నై. అవి యిక్కడ జరిగిన పోరాటంలో అద్భుతంగా పనిచేసాయి.

కొన్ని జర్మనుటాంకులు కొంతమంది కాల్బల సైనికులతో గర్జిస్తూ మేమున్న ప్రదేశానికి వస్తున్నయ్. వాని

సోవ్ మాట్లాడకుండా శత్రుగమనాన్ని కనిపెట్టాడు. అతడేమీ తొందర పడకుండా తన సైనికుల ఉద్రేకాన్ని కనిపెట్టినట్లుగా నటిస్తున్నాడు. అతడు తన లెఖల్ని త్వరగా పూర్తిచేశాడు.

"మొదటిటాంకు 20 గజాలు ఎడమకు!" అనే అతని ఆజ్ఞ వచ్చింది. ఆ మరునిముసంలోనే మోర్టారుగుండు ఎగిరింది.

అది వెళ్లి టాంకువెనకపడింది. జర్మన్ సైనికులు చెల్లాచెదురై పోయారు. చాలమంది నేలకొరిగారు. మొదటి గుండు వెంటరెండు, మూడు గుళ్లు వెళ్ళినాయ్. టాంకులు వదిలిపెట్టి పోయారు పాపం జర్మన్ యోధులు. కందక మోర్టారులతో కాల్బలసైన్యాల్ని హతమారుస్తుంటే టాంకు విధ్వంసక తుపాకులతో టాంకుల్ని ముక్కలు ముక్కలుచేశారు మనవాళ్లు. రెండుటాంకులు కాలిపోయినయ్. నాలుగు వెనక్కు పారిపోయినయ్. పదిసార్లు జర్మన్లు టాంకుల రక్షణతో మన రక్షణశ్రేణుల్ని ఛేదించి లోపలికి చొరబడాలని ప్రయత్నించారుకాని ప్రతిసారి బెనిసోవ్‌దళం కందకమోర్టారులతో చావు దెబ్బలు తిని వెనక్కు పోవాల్సి వచ్చింది.

కార్యదర్శి చెపుతున్నాడు! "కామేడ్ డెనిసోవును అతడు స్టాలిన్‌గ్రాడ్ వద్ద ప్రదర్శించిన అద్భుత ధైర్యసాహసాలకు సంతోషంతో, పరీక్షక సభ్యునిగా తీసుకోవాలనే తీర్మానాన్ని ప్రతిపాదిస్తున్నాను."

మేమందరం నవ్వుకొన్నాం. కామ్రేడ్ కొనిపోవటంలో కరస్పర్శ చేశాం.

చిరునవ్వుతో "నామీద పార్టీకి వున్న నమ్మకాన్ని వృద్ధి చేస్తున్నాను" అంటూ బయటకు వెళ్ళాడు.

వెళ్ళిన మరుక్షణంలోనే మళ్ళీ,

"మొదటి ట్యాంకు—40 గజాలు కదిలిన" అని అరాని గంభీరవాక్యాలు వినిపించినై.

అటువంటివాళ్లు సోవియట్ వీరుడు మేజర్ జనరల్ ఎ. రొడిమ్‌త్సోవ్ అధ్వర్యాన శిక్షణ పొందిన గార్డ్సు రైఫిల్ డివిజన్ సైనికులు నిరాడంబరం, వినయవిధేయతలతో కూడిన తమ జీవితాలను లెనిన్, స్టాలిన్ పార్టీకి యిచ్చి పట్టుదలతో ధైర్యంగా పోరాడుతున్నారు. దేశభవిష్యత్తు ఘోరవిపత్తులతో వడివున్న యీ సమయంలో వారంతా బోల్షివిక్కులుగా తయారవుతున్నారు.

## పావ్‌లోవ్ ఇల్లు

స్టాలిన్‌గ్రాడ్‌లో ప్రతియింటివద్దా భయంకరంగా పోరాటం సాగుతోంది. ఇక్కడ తెలివితేటలు యుక్తి బాగా పనిచేస్తాయి. పావ్‌లోవ్ చిన్నదళం ఒక యింటిని ఆక్రమించాలని ఆజ్ఞవచ్చింది: ఆయింటికీ యితర పొరుగు యిళ్ళకూ యేమీభేదంలేదు. ఆయిల్లు ఒక్కటే ప్రాంతానికి బజారు మధ్యలోవుంది. అదేభేదం తక్కిన యిళ్ళకూ దీనికీ. ఆయింటిని యింకా ఎందువల్లో జర్మనులు స్వాధీనపర్చుకోలేదు. ఆయింటిని వశపర్చుకొంటే ఆవరుస నంతటిని

స్వాధీనం చేసుకోవచ్చు. అప్రక్కయింటిలోనే శత్రువులు చొరబడివున్నారు. వాళ్ళకింత దగ్గరలోనే మన సైనికులు ఆయింట్లోకి రావటానికి సాహసిస్తారా అని అనుకొని వుంటారు. వాళ్లు జరిగిన విషయం తెలుసుకొనేటప్పటికి ఆపరిస్థితులు విషమించినై. పావ్‌లోవ్ దళం బయటి కార్యక్రమాన్ని సాగిస్తున్నారు.

రోజులు, వారాలు పోరాటంతో గడిచిపోయినై. జర్మనులు యీఅల్ప సంఖ్యాకుల్ని పరిమార్చటానికి చాలాసార్లు అనేకప్రయత్నాలు చేశారు. ఈ యింటిని తగలబెట్టారు. ఆటోమాటిక్ రైఫిల్ సైనికులు, స్నైపర్లు మనవాళ్ళను బయటికి కొట్టాలని ప్రయత్నించారు. ఆటోమాటిక్ రైఫిలు పోరాటాలు, ముష్టియుద్ధాలు చెలరేగుతున్నాయి అప్పుడప్పుడు. ఈపోరాటాల్లో స్నైపరు అలెగ్జాండరు 12 మంది జర్మనుల్ని హతమార్చాడు.

మనవాళ్లు భూగృహాన్ని తవ్వారు. వార్తాప్రసారానికి కందకాల్ని తవ్వారు. వీలున్నంతవరకూ సౌకర్యాల్ని కల్పించుకొన్నారు. మనసైనికభాగాని కంతకూ ఆయిల్లు, ఆయింటి నాక్రమించిన సార్జెంటు పావ్‌లోవ్ పేరుతోనే పావ్‌లోవ్ యిల్లని తెలిసింది.

అఫనసెవ్‌ను గనక "ఇవ్వాళ యెక్కడనుంచి పరిశీలన చేశా"నని అడిగితే వెంటనే,

"పావ్‌లోవ్ యింటివద్ద" అనిసమాధానంచెప్తాడు.

"ఇవ్వాళ యెక్కడ సొరంగాలు త్రవ్వుతున్నావు?"

"పావ్‌లోవ్ యింటి కుడివైపున."

డివిజనల్ హెడ్‌క్వార్టర్సునుంచి
"శత్రువు పావ్‌లోవ్ యింటికి ఎడమభాగాన కాల్బల సేనలల్ని కేంద్రీకరిస్తున్నాడు. మాకు పూర్తి వివరాలు పంపించాలి"

అని ఫోన్ చేశారు.

అదీ పావ్‌లోవ్ ఇంటికథ! క్రొత్త సైనికులు, సైన్యాధికారులు వచ్చారు. పాతసైనికానుభవాలతో పాటు యీ యింటిపేరు 'పావ్‌లోయిలు' ను కూడ గుర్తించారు. కాని అందు కొంతమంది ఆ యింటిపేరు ప్రాముఖ్యతను గుర్తించలేదు. అయినా ఆపేరే వుంచారు.

ఆధైర్యశాలి, సార్జెంటు అతని సైనికులు ఆ యింటిని గురించిన వివరాలు తెలుసుకోవటానికి వార్తలు వచ్చినప్పుడు గర్వపడుతుంటారు.

వారంతా వారి సాహస కృత్యాలతో అమరకీర్తిని గడిస్తున్నారు.

నవంబరు 19, 1942

## The Stalingrad Offensive

## స్టాలిన్‌గ్రాడ్ దురుపదాడి.

వాల్గానది గడ్డకట్టుతోంది. పెద్దపెద్ద మంచుగడ్డలు ఒకదానికొకటి కొట్టుకొని ఒక విధమైన ధ్వని చేస్తూన్నై. ఇంచుమించుగా నదంతా మంచుతో నిండిపోయింది. అక్కడక్కడ అనుంచు బాటమీద నీటిగుంటలున్నై. వాల్గానదిలోని ఆ తెల్లనిమంచు చెట్లమానుల్ని, దూలాల్ని

చేర వేస్తోంది. ఒక మంచుముక్క మీద నల్లటి పెద్దకాకి విచారంగా కూర్చొనివుంది. నిన్ననే ఆ ప్రాంతంలో ఒక నావికుని యీ కళేబరం తేలింది. ఆ దారినిపోయే ఒక చిన్న పడవ ఆ శవాన్ని తీసుకుపోయింది. శవం చుట్టూ మంచుగడ్డ కట్టింది. అతి ప్రయాసతో ఆ మంచును సడలించారు వాళ్లు. ఆ నావికుని తాను పోరాడి మరణించిన వాల్గాప్రదేశాన్ని వదలిపెట్టడానికి యిష్టం లేనట్లుగా వుంది! (ఆ మంచుగడ్డ కట్టటం వగైరా చూస్తే).

వాల్గానది మంచులో స్టీమర్లు, పెద్దపెద్ద పడవలూ తిరుగుతోంటే కొత్తకొత్తగా వుంది.

"ఇది ధృవమండల దండయాత్రలాగుంది" అన్నాడు ఒకపడవ క్యాప్టెన్. గడ్డకట్టిన నదిలో ప్రయాణం అంత తేలికైన పనిగాదు. మంచుముక్కల మధ్యనుంచి పడవను నడపాలంటే చాలాకష్టం. పడవ అప్పుడు తలక్రిందులుగా జరుగుతూవుంటుంది. యీ మంచుగడ్డల ఒత్తిడికి పడవలో గేతాడు మీద గట్టికట్టి మంచుకు సుత్తిపెట్టి చితకగొడుతూ వుంటారు. పడవ క్యాప్టెన్ గాలిదెబ్బతిని అలిసిపోయివున్నప్పటికీ పడవను అతిజాగ్రత్తగా నడుపుతూ స్టాలిన్‌గ్రాడ్ యుద్ధానికి మందుగుండు సామగ్రి ఆహార పదార్థాలు గుడ్డల్ని తీసుకువెళ్లుతున్నాడు పడవలమీద.

తొంభై రోజులు జర్మనులు స్టాలిన్‌గ్రాడ్ నగరంలోని యిళ్లు, వీధులు, ఫ్యాక్టరీలు, తోటలు అన్నిటినీ ముట్టడించి కాల్పులు సాగించారు, తొంభైరోజులూ మనదళాలు హోరాహోరీగా పోరాడి వేలాది జర్మనీ విమాన, టాంకు,

తుపాకుల మారణ అగ్నిజ్వాలల తాకిడిని వెనక్కుతిప్పికొట్టాయి. వందలకొలదీ భీకర దాడుల్ని రొడిమ్‌స్టెవ్ గొరొకొవ్ గుర్తవ్, సారయెవ్‌ల దళాలు ఎదుర్కొని జర్మనులను మట్టుమాపాయి. వారి అచంచలమైన, శిలాసదృశమైన పట్టుదల, చెక్కుచెదరని హృదయాలు, వారి రక్తస్రావాలే స్టాలిన్‌గ్రాడ్‌ను శత్రుదాడులనుంచి కాపాడాయి. మన రక్షణలకు చుట్టూవున్న వలయం మరింత బిగింపబడింది. బయటిదళాలతో ఏవిధమైన సంబంధమూ లేకుండవుంది. శత్రువు కాల్పులు తీవ్రతరమౌతున్నయ్. యుద్ధనగరమైన స్టాలిన్‌గ్రాడ్‌కు ఆగష్టునెలంతా అతికష్టంగా వుంది. సెప్టెంబరులో మరలవిషమించింది పరిస్థితి. ఇక అక్టోబరులో శత్రువుకు పూర్తిగా వెర్రెక్కిపోయింది. అప్పుడు ఆనగరం మీద కురిపించిన అగ్నివర్షానికి ప్రపంచంలో నేదీకూడ ఆగలేదనిపించింది. కాని ఎర్రసైనికులు ఆ దాడుల నన్నిటిని ఎదుర్కొన్నారు. ఇంతకు మానవాతీతమైన శక్తికావాలనుకొంటాను. వాల్గానది రక్షణశ్రేణుల్ని భేదించలేక పోయారు శత్రువులు. వాల్గానదిని, స్టాలిన్‌గ్రాడ్ నగరాన్ని రక్షించిన ఆ వీరయోధులకు ఆపోరాటం భయంకరస్మృతిగా వుంటుంది.

మళ్ళీ మేము వాల్గానదిలో ప్రయాణంచేసేటప్పుడు మా పడవనిండా జర్మన్‌యుద్ధఖైదీ లున్నారు.

"ఇప్పుడు వాళ్ళకు వాల్గాదృశ్యాలు బాగా కనిపిస్తున్నై అన్నా డొకనావికుడు. ఆ ఖైదీలు వాల్గానది మంచుగడ్డల వంక, నీటివంక చిరబురలాడుతూచూస్తున్నారు. అప్పుడు

వాళ్ళ ఆలోచనలన్నీ ఆ నీళ్ళలాగే నల్లగా, మురికిగా వున్నట్లున్నై. వాల్గానదివద్దకు వచ్చేరోడ్లన్నీ జర్మనీ యుద్ధ ఖైదీలతో నిండిపోయినయ్. ఆ విశాలమైదానంలో యీ ఖైదీలగుంపుల్ని యెంత దూరాన్నుంచైనా చూడవచ్చు. వాళ్ళు వందల, వందలమంది గుంపులుగా పోతున్నారు. 20 మంది, 50 మంది ఉన్న గుంపులుకూడ ఉన్నై. మాకు సుమారు ఒక మైలుదూరంలో ఒకగుంపు వెళ్తోంది. అందులో 3000 మంది పైగా వుంటారనుకొన్నాం. వాళ్ళను కొద్దిమంది ఎర్రసైనికులుమాత్రమే వెంటవుండి తీసుకుపోతున్నారు. రెండేసివందలమంది ఉన్నగుంపుల్ని యిద్దరు, ముగ్గురు ఎర్ర సైనికులే తీసుకెళ్తున్నారు. జర్మనులు రష్యన్ సైనికుల నాయకత్వాన సంతోషంగానే వెళ్తున్నారు.

"మాకు యుద్ధం వద్దు. మేము యిళ్ళకుపోతాం. ముద రష్టపు హిట్లరు!" అని కేకలేస్తున్నారు.

వాళ్ళవెంటవున్న మన సైనికులు హేళనగా—

"చూస్తున్నాం, మన టాంకులు వాళ్ళదళాలవెనకవుండి రోడ్ల నన్నిటినీ పాడుచేసినతర్వాత, యుద్ధంవద్దని యెంత అధైర్యంగా అరుస్తున్నారో చూడండి వాళ్ళు. యింతకుముందెప్పుడూ యీ ఆలోచన తట్టలేదు వాళ్ళబుర్రలికి పాపం! మన గ్రామాల్ని కాలుస్తూ ముసలీ ముతకల్ని చంపటంతో సరిపోయిందికాలం. ఇంకా ఆలోచనకు అవకాశం ఏది పాపం!" అంటున్నారు.

గుంపులుగుంపులుగా జర్మనులు మమ్మల్ని దాటిపో తున్నారు. వాళ్ళభుజాలమీద బెల్టులు ఉన్నిగుడ్డలతో కట్టే

యనే వార్త మనసేన కంతటికీ తెలియజేయటానికి టెలిఫోనులు గోలచేస్తున్నై.

ముందుకు వస్తున్న టాంకుల జాడారంతో మేం వేస్తున్నాం. రోడ్డంతా శత్రుశవాలతో, పాడైన తుపాకులతో, కాలిపోయిన గడ్డితో నిండివుంది. గుర్రాలు సకిలిస్తున్నై. కాలిపోతున్న ఉక్కుకవచాలు, చేతిగ్రెనేడ్లు రైఫిలుగుళ్ళ వెలుగులో రోడ్డు స్పష్టంగా కనుపిస్తోంది.

బూడిదవర్ణంగా వుండే ఆ విశాలమైదానం రక్తంతో తడిసి యెర్రగా వుంది. యుద్ధఖైదీలప్రవాహం ఎడతెగకుండ పోతోంది. ఖైదీలను వెనక్కుపంపేముందు పూర్తిగ పరిశోధిస్తారు. ఈ నరరూపరాక్షసులు చేసిన ఘాతుకకృత్యాల చిహ్నాలుగా పల్లెస్త్రీలవస్తువులన్నీ వీళ్ళ జేబుల్లోనూ, సంచుల్లోనూ దొరుకుతున్నై. ఇంకా ముసలివాళ్ళ చేతిగుడ్డలు, కోలకలు, లోదుస్తులు, పసిబిడ్డలగుడ్డలు, సుందరాంగుల బ్లౌజులు (జాకెట్లు)కూడ ఉన్నై. ఒకడిదగ్గర 22 జతల మేజోళ్ళు ఉన్నాయి. ఇంకోడిదగ్గర పాడైన, ఒక స్త్రీబూట్లున్నాయి. ఇంకా చూస్తే యిలాంటివే కాకుండ చెడిపోయిన తుపాకులు వగైరాలుకూడ దొరికాయి. వీళ్ళదగ్గర దొరికిన కార్డ్లు, ట్రక్కులు చాలసార్లు వెనక్కుపంపాం. మేము అబ్గనెరోవో రైల్వేడంక్షను దగ్గరకొచ్చాం. ఒకవృద్ధరైతు స్త్రీ జర్మనుల ఆక్రమణక్రింద ఉన్న మూడు నెలల్లోనూ తాము అనుభవించిన నరకబాధలన్నీ చెప్తోంది.

ఆ ప్రదేశమంతా శుభ్రంగా తుడిచివేశారు. ఒక్కకోడి గాని, కోళ్ళగూడుగాని ఎక్కడా మచ్చుకైనా లేదు. ఒక్క

ఆవునుకూడా వదిలిపెట్టలేదు. మాకు ప్రాధాన పచ్చికతేవల సిన అవసరంగాని. సాయంకాలం పాలంతోలటానికి గొడ్లు గాని లేవు. ఆ దొంగలు మా సర్వస్వాన్ని దొంగిలించారు. మేము మానవులలాగ మాట్లాడటమంటే ఏమిటో మర్చిపోయాం. మేము నెమ్మదిగానైనా సరే మాట్లాడుకోవటం వినపడిందా మమ్మల్ని బయటికిలాగి బాదేవాళ్ళు. ఇక్కడి ముసలిజనమంతా కొరడాదెబ్బలు తిన్నారు! కొందరు పని చేయటానికి నిరాకరిస్తేను, కొందరు వారి ధాన్యరాశుల్ని చూపించకపోతేను. స్లావొవిటయావద్ద యింటి యజమాని మూడుసార్లు తిన్నాడు కొరడాదెబ్బలు. వాళ్ళ నాకొడుకు, కుంటివాడును, వాడికొడుకూ కూతుర్ని ఎక్కడికోపంపారు. నేను నాల్గురోజులనుంచి కంటికిమంటికి ఏకధారగా ఏడుస్తున్నాను. వాళ్ళెక్కడున్నదీ ఆ భగవంతుడికే తెలియాలి.''

అబ్గనరోవ్ విజయచిహ్నాలతో నిండిపోయుంది. ఇక్కడ వందలాది తుపాకులు నానాముఖాలుగా వాటిముఖాల్ని పెట్టి అమర్చబడిఉన్నై. ఇక్కడకూడ అనేకం పట్టుకొన్న ట్రక్కులున్నై. వాటికి వివిధదేశాలనుండి తెప్పించబడ యున్నై. రైల్వేస్టేషనులన్నీ మనవాళ్ళు పట్టుకొన్న రైళ్ళతో కిటకిటలాడుతున్నై. ఆ వాగనులమీద హిట్లరు కుక్కలా దోచిన నగరాల పేర్లు, దేశాలపేర్లు ఉన్నై. అంటే ఆ రైలుపెట్టెలు ఆయానగరాల, దేశాలకు చెందినవన్నమాట. ఇక్కడ ఫ్రెంచి, బెల్జియన్, పోలిష్ పెట్టెలున్నయ్. వాటిమీద ఆయాభాషలతో వ్రాయబడిఉన్నై. వాటిప్రక్కనే ఆయా ప్రదేశాల దాస్యస్థితిని తెలియజేయటానికి, రేచ్ బొమ్మ

నల్లరంగుతో వేయబడివుంది ప్రతిపెట్టమీద. ఇక్కడ పింపి, మందుగుండుసామగ్రి, తోటాలు, కారులు, బూట్లు, సెచ్చి లైట్లు, ఇంకా ఇతరయంత్రసామగ్రితోనిండిన రైళ్ళు ఉన్నై. రెడ్‌క్రాస్ పెట్టెలు చూడటానికి అసహ్యంగా ఉన్నై. చింపిరి గుడ్డలతోసహా, చీకటిగానూ మురికిగాను ఎర్రసైని కులు యీ రైళ్లనుంచి పిండిబస్తాలను లాగి ట్రక్కుల్లో వేస్తున్నారు.

ఆ సాయంకాలం మేము సాగిపోతున్నాం. దళాలుకూడ కదిలినై. నల్లని టాంకుతుపాకి మొనలు క్రిందికీ పైకీ ఊగు తున్నై. టాంకులు రణగొణ ధ్వనితో కదిలిపోతున్నయ్. అశ్వికదళాలు కదం త్రొక్కుతూ పోతున్నయ్. చలి గాలి మైదానంమీదనుంచి ఎండిపోయిన పొగమంచును తెచ్చి మా ముఖాలమీద కొడుతోంది. యెర్రసైనికుల ముఖాలు యీ శీతకాలపుగాలికి కందగడ్డలాగఅయినై. అరు బయట బొమికకంటావళ్ళీ అమితబాధపెట్టే ఆ చలిగాలితో గేయాలను పాడుకుంటూ ఉత్సాహంతో ధైర్యంగా సాగి పోతున్నై ఎర్రసేనదళాలు.

ఈ విధంగా స్టాలిన్‌గ్రాడ్ యుద్ధం ముందుకు పోతోంది. మనసైనికుల నైతికసంపత్తి అఖండంగా ఉంది. సైన్యం లో పై అధికారివద్దనుంచి మామూలుసైనికుని వరకూ తన బాధ్యతను గుర్తించి, ధైర్యంతో పరిస్థితుల్ని జాగ్రత్తగ పరిశీలిస్తున్నారు. సైనికాధికారులు అతి పట్టుదలతో పని చేస్తున్నారు. సైనికాధికారులికి విశ్రాంతిఅనేదిలేదు. రాత్రి.

పగలు భేదమే లేదు వారికి. పై సైనికాధికారులు ప్రశాంతంగా, అప్రమత్తతతో తమ కార్యాల్ని చక్కబెడుతున్నారు. లో స్వరంతో కఠినఆజ్ఞల్ని జారీచేస్తున్నారు. అధికార కార్యాలయంలో పనివొత్తిడి యెక్కువగా వుంది. ఇప్పటివరకు లక్ష్యమయింది అమోఘమైన విజయం. కాని ప్రతివాళ్ళూ శత్రువును జాగ్రత్తగా కనిపెట్టిఉండాలి తప్పించుకుపోకుండా. సర్వనాశనం చేయాలి. స్టాలిన్‌గ్రాడ్ రంగంలోని సైనికులు యీ పని చేయటానికి శాయశక్తుల పాటుపడుతున్నారు. మనలో ఒక్కరికయినా ఆడంబరత్వం, అల్పసంతోషం ఉండకూడదు.

ఈ స్టాలిన్‌గ్రాడ్ మహాయుద్ధం గొప్ప శత్రు పరాజయంగా ఉండాలి. స్టాలిన్‌గ్రాడ్ రక్షణ గొప్పదనాన్ని కూడ తెలియజేస్తుంది.

డిసెంబరు, 19·2

---

## అపవైరెంపవ సైన్యం

(మేజర్ వివెలిచ్‌కో)

### I

ఒక ప్ర లైటు విశాల శాన్ మైదానంమీద ప్రకాశిస్తోంది. ఆ దీప కాంతితో మైదానమంతా విషాదపూరితంగా కనిపిస్తోంది. ఆ మైదానంలోనే రోడ్లమీద చిందరవందరగా శత్రు మోటారులు తిరుగుతున్నాయి. అక్కడి జర్మనులు సోవియట్ కల్పవృక్షాన్ని నాశనం చేయటానికి బయలుదేరిన విషకీటకాలలాగ స్టాలిన్‌గ్రాడ్ వైపుకు వస్తున్నారు.

ఆ యుద్ధరంగం చాల పొడవు వుంది.

ట్యాంకుల భీషణ పోరాటంవల్ల భూమి అంతా క్రక్కదలిపోయి ఆకాశాన్నంటేంతవరకు దుమ్ము ధుమారాలు లేచి ఆప్రదేశాన్నంతా కప్పివేశాయి.

U2 లైటు ఆ రంగానికంతకూ వెలుగునిస్తూ అటూ యిటూ త్రిప్పబడుతోంది.

ఆవిమానంలో వైమానికుని వెనకనే కూర్చొని ఆమ్యాపుమీద విమానగమనాన్ననుసరించి, గుర్తులు పెడ్తున్న ఆ ప్రయాణీకు డెవరు?... 62 వ సైన్యానికి సర్వసేనాధ్యక్షుడు లెఫ్టినెంట్ జనరల్ చూకోవ్ కాదూ?....అవును. అతనే అదిగో అతనివద్దనున్న దత్తాంశాన్ని (Data) పరిశీలిస్తున్నాడు. అతడు యిలాంటి విమానంలో వెళ్ళటం చాల ప్రమాదమనే విషయాన్ని విస్మరించాడు. ఇంకోవిమానంలో వెళ్ళే వీలుండేది. కాని ప్రతిచిన్నవిషయాన్ని అతిసూక్ష్మంగా పరిశీలించటంకోసం యిలా అతినెమ్మదిగా పోయే విమానమే కావలసివచ్చింది.

శత్రుదాడి స్థాలిన్ గ్రాడ్ ను త్వరితంగా సమీపిస్తోంది. స్టాలిన్ గ్రాడ్ నగరం అప్పుడే మంటల కాహుతైపోతోంది.

62 వ సైన్యం అధికారివర్గం 1020 కొండమీద స్థావరం ఏర్పరచుకొనివుంది. స్టాలిన్ గ్రాడ్ యుద్ధరంగ దృశ్యమంతా విస్పష్టంగా కనపిస్తుం దక్కడికి. సర్వసేనాని నెమ్మదిగా జాగ్రత్తగా యుద్ధరంగాన్ని పరిశీలించాడు. అతడు నగరవీథుల్ని ఇళ్ళనూ పరిశీలించాడు. తన సైనికు

లకు 'చివర వరకు పోరాడమని రాత్రింబవళ్లు కందకాలు త్రవ్వమనీ ఆజ్ఞలు పంపాడు.

ఒకప్పుడు జారిట్సిన్ నగరంగా ఉన్న యీ నగరాన్ని స్టాలిన్ రక్షించిన విధానాన్ని, ఆ అనుభవాన్ని, యితడు చక్కగా ఉపయోగించుకొన్నాడు.

నగరం మంటల మధ్యనున్నప్పటికీ పురోగామి సైనికులు (Sappers) తీరిక లేకుండ పనిచేస్తున్నారు. రక్షణ దుర్గాలను నిర్మిస్తున్నారు. ఆ నగరం యుద్ధభూమిగా మారినా తమపని వదలలేదు. ప్రతి యింటి కిటికీలోను శత్రువిధ్వంసక యంత్రాలను పెట్టారు. ప్రతియింటి కప్పుమీద తుపాకుల్ని అమర్చారు. ప్రతిబజారు కేంద్రం శత్రు వధ్య శాలగా మార్చారు.

62 వ సైన్యం స్టాలిన్‌గ్రాడ్‌ను శత్రుదుర్భేద్యమైన కోటగా మార్చారు.

సైన్యం నవయువకులతో నిండింది. ఇంచుమించుగా పసితనంలోనే వున్నదని చెప్పవచ్చు. కానీ అమరకీర్తి గడించిన జారిట్సిన్ నగర రక్షకుల స్మరణయే వారిని ఉత్తేజితుల్ని చేస్తోంది. ఒకసారి సైనిక సలహా సంఘసభలో సర్వసేనాని యిలా అన్నాడు: ''ప్రతిసైనికుడు నగర-రక్షణ శిలలు గావాలి.''

ఆ సైన్యం తన కార్యక్రమాన్ని ఆ అగ్నిజ్వాలలమధ్యనే కొనసాగించింది. మొదటి కాల్పులతో పొందిన అనుభవంతో

దుర్భేధ్యమైన కాంక్రీటు దుర్గంగా తయారు చేసారు స్టాలిన్‌గ్రాడ్‌ను.

## II

ఘోరసంగ్రామం జరుగుతోంది.

స్టాలిన్‌గ్రాడ్ మండిపోతున్న అగ్నిపర్వతంలావుంది. ఆ అగ్ని శిఖరాగ్రంనుంచి ప్రళయ భీకరధ్వనితో వికారం పుట్టించే పొగ బయలుదేరుతోంది. నల్లనిమసితో అనగర పరిసరప్రాంతాలన్నీ కప్పివేయబడ్డాయి. రాత్రిళ్లు ఆ మంటల కాంతి ఆకాశాన్నికూడా ప్రకాశవంతంగా చేస్తోంది.

జర్మన్ సైనికులు లెక్కకు మిక్కుటంగావున్నారు. కాని వాళ్ళ యోధవీరులంతా 62 వ సైన్యం పాదాలక్రింద దీర్ఘ నిద్రాముద్రిత సమాధుల్లో వున్నారు. పాపం! ఒకసారి అధికసంఖ్యాక సైన్యసముపేతుడైన శత్రువు భీషణ సంగ్రామ విధానంచూస్తే జనరాసులు రేమిటో ఆ యుద్ధానంతరం యీభూమిమీద నిలిచివుంటా యనుకో లేదు.

సైనిక సలహాసంఘం సమావేశమయింది ఆ నాటి పరిస్థితిని చర్చించడానికి.

సర్వసేనాని అతనిమ్యాపు వైపుచూస్తూ దీర్ఘ నిశ్వాసంతో యిలా అన్నాడు:—

"ఇదిగో యిక్కడ మన గార్డులు నిలబడవలసింది."

ఇది చాల కష్టసాధ్యమైన పని!

కాని అప్పటికప్పుడే సర్వసేనాని అగ్రదళాలునుంచి టాంకుల్ని పంపిస్తున్నాడు.

“కానివ్వండి. ఒక్కటి కూడ మిగల్చవద్దు!” అన్నాడు. అతను పిడికిలిబిగించి చెప్పలేనంత అతిసూక్ష్మబుద్ధితో అన్నాడు. ఈ సైనికవిన్యాసం స్వయంగా చేస్తున్నాడు.

జర్మన్ సైన్యాలు వాళ్ల మధ్య ప్రాంతంలో బలవత్తరమైన కేంద్రీకరణచేసి అధికంగా టాంకుల్ని దింపుతున్నాయి. ఆదృశ్యం ముష్టిఘాతంకొరకు ఎత్తిన కవచధారిపిడికిలిలాగ వుంది. శూన్యాకాశంలో బాంబులు ప్రేలుతున్నై. ప్రతి చిన్నవిషయం కూడ ప్లానుప్రకారం జరుగుతోంది. జర్మనులదాడి సరాసరి నగర మధ్యకుపోయి 62వ సైన్యాన్ని ధ్వంసంచేసి వాళ్లానదిలో త్రోయాలని ప్రయత్నిస్తోంది.

జర్మనులు వారికి రాబోయే విజయాన్నిగూర్చి గట్టి నమ్మకంతో కలలుగంటున్నారు. వాళ్లు కందకాల్లోనుంచి మనసైనికుల్ని సంబోధించి “రష్యన్‌లారా! మీరోజుదగ్గర కొచ్చింది” అని అరుస్తున్నారు.

ఈ పరిస్థితినుంచి తప్పించుకోటానికి గౌరవప్రదమైన మార్గం వుందా?

మనసైనికాధికారుల మనసైనిక విన్యాసంయొక్క విజయం మనసైనిక సంఖ్యాబలం మీంద ఆధారపడలేదు. శత్రుదాడి జరుగుతుందనుకొన్న వైపుననున్న మనదళాలు ముందుకుపోయి నదినిదాటి శిథిలాల్లోనుంచి అదృశ్యమయ్యారు. తరువాత, కాల్పులయిన పిమ్మట నెమ్మదిగా అశిథిలాల మీదుగా ప్రాకుతూ సైన్యం అంతా వచ్చింది.

మరునాటి ఉదయానికి పెద్దయెత్తుదాడికి సన్నద్ధులయ్యారు. ఈ దండయాత్ర ముందుకు సాగింది కాని గార్డులు తమ పార్శ్వభాగాలనుంచి శత్రువును భయంకర అగ్నిజ్వాలల పాలుచేశారు. శత్రువు ఎక్కడ ఎదురుదాడిని ఊహించలేదో ఎక్కడ ఎదిరించలేరను కొంటున్నాడో అక్కడే ఇంద్రజాలం చేసినట్లుగా పూర్వయోధుల సాంప్రదాయాల్ని కాపాడుతూ మనసైనికులు లేచి కాల్పులు సాగించారు.

జర్మన్ల 'కవచహస్తపు పిడికిలి' విరిగిపోయింది. వ్రేళ్లు తెగిపోయినాయి. దెబ్బ తప్పిపోయింది. శత్రువు రక్షణలో పడ్డాడు.

అదే జర్మన్లకు పదివేలుగావుంది.

స్టాలిన్‌గ్రాడ్ యుద్ధచరిత్రను పరిశోధించు యుద్ధచరిత్ర విద్యార్థులు అక్కడ జరిగిన ప్రతిసైనిక విన్యాసమూ, ఒకదానితో ఒకటి కలిసివున్నదని, స్టాలిన్‌గ్రాడ్ రక్షణ ఏొక నిర్మాణయుతమైన సైనిక నిర్మాణమువల్లనే సాధ్యమైందనీ సైనిక కేంద్రీకరణే మూలసూత్రమనీ తప్పక తెలుసుకోగలరు.

స్టాలిన్‌గ్రాడ్ యుద్ధం మూల మూలలకు ప్రాకింది. రోజరోజుకూ యుద్ధతీవ్రత హెచ్చింది. రోజుకు 16 గంటల చొప్పున 13000 మరతుపాకులు పనిచేసేవి రెండువైపులా. రోజూ 1500 విమానాలు పోరాడేవి. ప్రతిచదరపు ఫర్లాంగు 40000 బాంబులతోనూ 6000 టన్నుల లోహంతోనూ దగ్ధంచేయబడింది.

కాని 62వ సైన్యం శత్రువును పట్టుకొని—వాళ్ళవి—ప్రతీకారం—వాళ్ళకు అప్పచెప్పటానికి పూనుకొంది.

శత్రువుతో పోరాడింది బలంతో కాదు, తెలివితేటలతో, యుక్తితో. ఆ సైన్యం వీధిపోరాటాలు నేర్చుకోవటానికి ఒక కవచంలాగ ఉపయోగపడింది. గోతుల్లోనూ కందకాల్లోనూవున్న మనుష్యులే ఆ కళాశాల విద్యార్థులు. ఈ కందకాలు, గోతులే వారికి శిక్షణమందిరాలు. శత్రువిద్వేషమే వారికి పుస్తకాలు.

లాన్స్ సార్జంట్ నికోలోవ్ లెంకో—నవయువకుడు, డెంతిస్టులమేడ హతశేషమైన మెట్లమీద నిలబడి తన సైనికుల్ని నడుపుతున్నాడు. ఆ ఇరుకు మెట్లవరుసను యుద్ధరంగంగా మార్చడానికి అసాధారణమైన చాతుర్యం, తీవ్రమైన పట్టుదల వుండాలి. లాన్స్ సార్జెంట్ రస్కిన్ సైనికులు తుపానులాగవచ్చి ఆ మెట్లక్రింద చేతిగ్రనేడుల్ని ఇంకా పెదిలెరపరికరాల్ని కుప్పలుకుప్పలుగా దాచి జర్మనులను హతమార్చారు. అంద్రీబాలోలొవ్ కూడా ఆ ఇంటి శిథిలాలక్రింద దాగివుండి అదేవిధంగా ఆ పనిచేశాడు.

ఇది త్వరగా ముగిసే చిన్నపోరాటం కాదు. దీర్ఘంగా 16 గంటలు జరిగింది. ఆవిధంగా యువశక్తి ఒక్కటే నిలబడగలదు.

ఈలోపున 62వ సైన్యం, జర్మనులు యెదురుబడి తమతమ శక్తిసామర్థ్యాలను చూపించుకుంటున్నాయి. ఈ రోజుల్లోనే యంగ్ కమ్యూనిస్టు లీగ్ సభ్యుడైన వాసిలి

కెల్సెవ్ స్టాలిన్‌కు సందేశం పంపించాడు:

"నాకు వాల్గానది అవతలి ఒడ్డున ఏమీ భూమి లేదు."

## III

జర్మనులు మన శ్రేణుల నన్నిటి నిండా కరపత్రాలు నింపారు.

ఈ కరపత్రాలనిండా అబద్ధాలు, మోసం, బూతులు, బెదిరింపులు. దీనితరువాత యింకో కరపత్రం వేశారు. దాని మీద గుర్రపుడెక్కల బొమ్మ వుంది. ఆ డెక్కల చివరిభాగాలు రెండు వాల్గానదివొడ్డున కలిశాయి. ఆ డెక్కలమధ్య 62 వ సైన్యం ఉంది.

ఈసారి యదార్థమే. 62 వ సైన్యం వెనుకభాగం వాల్గానది వైపుకు పెట్టి జర్మను గుర్రపు డెక్క వ్యూహంలో బంధింపబడినమాట నిజమే.

వాల్గా వొక్కటే ఉత్తరప్రత్యుత్తరాల సౌకర్యాలకు ఉపయోగపడుతోంది 62 వ సైన్యం వెనుకభాగం. ముందు భాగాన సైనికబలం ఉంది. కాని [illegible] శ్రేణులు అగ్ని మంటల్లోంచి పోవాలిసివచ్చింది. నగరముఖంగా వాల్గా తీరాన్ని చదరపుభాగాలుగా విభజించి ప్రతి చదరాన్ని మంటల్లో వుంచారు.

జర్మనులు నగరవిధ్వంసనకు వీలున్న అన్నివైపులనుంచి తుపాకుల్ని గురిపెట్టి వుంచారు అన్నికొండలమీద. ఈ కొండలమీదనుంచే వాల్గానదిమీదకు కాల్పులు కాల్చాలి.

ఇక్కడికి ప్రతివస్తువు విస్పష్టంగా కనుపిస్తుంది. వాల్గానదిలో కాస్త నల్లగా యేదైన కనుపిస్తే చాలు ఇక్కడినుంచి భారీట్రెంచి మోర్టారులు భయంకరంగా కాల్పులు సాగిస్తయ్.

తుపాకీగుళ్ళతో వాల్గానదంతా వెచ్చబడింది. ఆప్రాంతంలో ఎవ్వరూ నిలబడలేదు. అంత భయంకరంగా వుంది. కాని 62 వ సైన్యం ప్రతినిమిషం యెదిరిస్తూనేవుంది. వాళ్ళకు కావలసినదల్లా తుపాకీ, మోర్టారుగుళ్లు, రక్షణల నిర్మాణానికి కొయ్య, ఆహారపదార్థాలు.

ఒకనాడు ఉదయం బెకెటోవ్‌కా-కిరోవ్ జిల్లాలో వాల్గా నదిలో ఒక తెప్ప కొట్టుకొస్తోంది. ఆ తెప్పను నదీప్రవాహం ఒడ్డుకు నెట్టింది. అక్కడికొచ్చి ఆగిపోయింది. ప్రజలు, ఎర్ర సైనికులు ఆ తెప్పదగ్గరకు పరుగెత్తుకొచ్చి దాన్ని చూచి ఆశ్చర్యంతో ఆగిపోయారు. దానిమీద నలుగురు — ఒక లెఫ్టినెంట్, ముగ్గురు ప్రైవేటులు — పడుకొనివున్నారు. వారి శరీరాలు గుళ్ళదెబ్బలతో తూట్లు పడిపోయివున్నయ్.

అందులో ఒకడు యింకా కొనవూపిరితో వున్నాడు. కళ్లు తెరవకుండా, యెటూ మసలకుండానే—

"ఇదేమిటి?...కుడివైపేనా?" అన్నాడు.

"ఆఁ, కుడివైపే!"

"అయితే ఎక్కడికి ప్రవాహం అక్కడికే వచ్చిందన్న మాట" అని ఆఖరి నిశ్వాసం విడిచాడు.

తీవ్రత రోషావేశాలింతగ్గలేదు. క్షతగాత్రులైనకూడా ఏ ఒక్క అవయవం కదల్చటానికి వీలున్న ప్రతిసైనికుడూ కందకాన్ని వదలిపోవటానికి యిష్టపడటంలేదు. సైనికులంతా తమ అధికారులు ఆజ్ఞను ఇస్తున్నట్లే భావిస్తున్నారు. తుపాకిగుళ్ళతో శరీరమంతా తూట్లుపడ్డసైనికుల్ని వాళ్లానడగట్టుకు చేరస్తున్నారు.

సర్వసేనాని క్షతగాత్రులను ఖాళీచేసిన ప్రదేశాల్ని పరిశీలిస్తూ నడుస్తూ పోతున్నాడు. పొగ, దుమ్ముతో ముఖమంతా ముడికిబారి వుంది. సంస్కారంలేని జుట్టు టోపీలో నుంచి బయటికి తొంగిచూచి గాలికి యెగురుతోంది. ఐనా అతని కళ్ళల్లో తేజస్సు తగ్గలేదు. క్షతగాత్రులంతా తమ నాయకుల్ని గుర్తించారు.

"కామ్రేడ్ సేనాని...... నేను చనిపోతున్నాను. వాళ్లతో చెప్పండి నన్ను నది కవతలివైపుకు తీసుకు పోవద్దని. వాళ్లా కటువైపు నాకు స్థానంలేదు" అన్నాడందులో ఒకడు.

సూర్యుడస్తమించాడు.

ఆనాడు స్టాలిన్‌గ్రాడ్ రక్షకులు భవిష్యత్తులోనికి తొంగిచూశారు. ఈ ప్రపంచంలో యెవ్వరూ యీ వీరుల్ని అడ్డగించలేరు. ఎదిరించి నిలవలేరు. 62 వ సైన్యం దృఢంగా నిలబడింది. ఒక్క అంగుళమైనా వెనక్కు వేయలేదు. ఆ సైన్యం యింకా పసితనంలో లేదు. బాల్యావస్థదాటి యౌవనదశ ననుభవిస్తోంది.

అర్ధరాత్రివేళ యిదివరకటిలాగే అగ్ని పర్వతం బ్రద్దలయింది. 6 గొట్టాల కందక మోర్టారులు వాటి ప్రతాపాన్ని చూపిస్తున్నాయి.

స్టాలిన్‌గ్రాడ్ రంగం సైన్య సర్వసేనాని కల్నల్ జనరల్ యెరెమెంకోవ్ నెమ్మదిగా పడవలోనుంచిదిగి, రెండు సార్లు విరిగిన తన కుంటికాలిమీద వొరగుతూ నెమ్మదిగా జనరల్ చుకోవ్ వున్న గోతివైపుకు నడిచి వెళుతున్నాడు. చుకోవ్‌ను కలుసుకోడానికి ఇతను స్టాలిన్ వద్దనుంచి వచ్చాడు.

అక్కడే వార్తావాహకుడు జోనస్ స్కోర్నియకోవ్ వొక్కడే కనుపించాడు. అతడు తీవ్రంగా గాయపడి వున్నాడు. అయినా సర్వసేనానిని సైనిక మర్యాదలతో గౌరవించి ఆహ్వానించాడు.

"ఇక్కడంతా సరిగానే వుంది. సర్వసేనాని సైనిక దళాలతో యున్నాడు" అని చెప్పాడు.

## IV

మళ్లీ యుద్ధం ప్రారంభమైంది. జయాపజయాలు త్రాసులో ఉన్నై. జర్మనులు మహాసైనిక ప్రవాహానికి అడ్డుకట్టకట్టి నిలిపారా అన్న భ్రాంతిని గొలుపుతోంది ఆ సైనిక సంఖ్యచూస్తే. ఒకటా, రెండా? యిరవై ఐదు లక్షలు! ఈ మహాసైన్యాన్ని ఒక్క స్టాలిన్‌గ్రాడు నగరముట్టడికి పంపాడు, రక్తపిపాసి హిట్లరు. సోవియట్ 62 వ సైన్యం మామూలు ఆరుగురు, ఆరుగురుగల దళాలతోనే

ఆ రాక్షససేనను యెదుర్కొంది. ప్రతిసారి, ప్రతిసేనా నివహం దాడి సలిపినప్పుడు ''పోరాటదళాల''ను నిర్మించారు (Assault Squads). నిర్మాణయుతమైన ప్రతిదాడికి ఈ 'పోరాట దళాలు' శత్రువుకు యీటెపోటులులాగ పనిచేశాయి.

ఆరుగురు, యెనిమిదిమంది కలిసిన యీ ''పోరాట దళాలు'' ముందువెళ్ళి శిథిల గృహాలలో దాగియున్న శత్రు మూకల్ని చీల్చి, చెండాడి బయటికి తరిమివేశాయి. వాళ్ళ వెనక కందకసైనికులు సాయుధహస్తులై వచ్చేవారు. ''పోరాట దళాలు'' శత్రు రహస్య కేంద్రాలను కనిపెట్టి పట్టుకొని నాశనంచేస్తూ యెదురుదాడి ప్రయత్నాలను విఫలం చేశాయి.

ట్యాంకు, విమానబలాల అండతో ఉన్న లక్షలాది జర్మను సైనికులు యీ ''పోరాటదళాల''కు జోహారులర్పించి వూరుకొన్నారు. 62 వ జర్మన్ సైన్యాన్ని హతమారుస్తోంటే యీ ''పోరాట దళాలు'' విజృంభించి శత్రువుతో యెదురుదాడులు సాగిస్తోన్నయ్.

అదీ, స్టాలిన్‌గ్రాడువీధి పోరాటం. స్టాలిన్‌గ్రాడు యుద్ధకళ అధిక సంఖ్యాక సైనికబలంతో గాదు సృష్టించబడింది. నేర్పుతో, యుక్తితో!

సెప్టెంబరు 20 న ఉదయం 11-30 గంటలకు రైఫిల్ బెటాలియన్‌కు చెందిన 2, 3 కంపెనీల సేనానులు కామ్రేడ్ క్రావ్‌ట్సోవ్, కోల్‌స్త్సోవ్ తమ సేనలన్నీ చుట్టుముట్టబడ్డాయనీ, తాము తీవ్రంగా గాయపడ్డామనీ రిపోర్టు చేశారు కాని యింకా యీవిధంగా వ్రాశారు :

"కంపెనీ సేనాని బ్రతికివుండగా మాత్రం ఒక్క జర్మనీ వాణ్ణికూడ ముందుకు కదలనీయం. స్టాలిన్‌గ్రాడు ప్రజలు వెనక్కు తగ్గరు!"

62 వ సైన్యం సైనికులంతా నగరాన్ని ఆక్రమించారు. ఒక్కొక్క సైనికుడు ఒక్కొక్క రక్షణశిల అయ్యాడు. ఆ మహానగరం ఎన్నడూ వెనక్కు తగ్గదు!

## V

యుద్ధం సాగుతోంది.

అపజయం, అధైర్యం అంటే ఏమిటో తెలియని వీరాగ్రేసరులు అనేకమంది వచ్చి ఆ మహాయుద్ధంలో పాల్గొంటున్నారు.

శత్రువును చావుదెబ్బకొట్టాలనే 62 వ సైన్యం దృఢసంకల్పం ఏమీ సడలలేదు.

శత్రువును దెబ్బతీయటానికి మరోమార్గం ఏమైనా వుందా?

సైనిక సలహాసంఘం వివిధరకాల సైనిక విన్యాసాలను, ఎత్తుగడలను చర్చించింది. చివరకు సర్వసేనాని "భూమి క్రిందనుంచి శత్రువును దెబ్బకొడదాం" అని నిర్ణయించాడు.

"పోరాట దళాల" ముదురు దాడుల్ని క్రిందనుంచి మందుగనులు బలపరుస్తున్నాయి.

అగ్నిదళాలుకూడ యీ పోరాటదళాలకు కలపబడ్డాయి.

జర్మనులు వాల్గానదిని అగ్నితో నింపిన ప్రదేశములోనే

మొట్టమొదటి మందుగని దాడి, వ్లాదిమిర్ కుబోవ్, ఇవాన్ మాకరోవ్‌ల నాయకత్వాన ఉన్న దళాలు జరిపాయ్.

శత్రువు బలవత్తరమైన స్థానం అక్కడ. ఒక అయిదు గజాలలోతు గొయ్యి త్రవ్వి అక్కడనుంచి నలభై మూడు గజాలపొడుగు; 3/4 గజము వెడల్పు, గజము ఎత్తున ఒక సొరంగం చేశారు.

శాపరుదళాలు (సైన్యాలకు ముందు భూమిని బాగుచేసే దళాలు) 14 రోజులపాటు సూర్యరశ్మి కన్నెరుగరు. ఆ 14 రోజులు రాత్రింబవళ్లు ఎలక్ట్రిక్ దీపాలతోనే పనిచేసే వారు. సరిగా నిలబడడంకూడ మర్చిపోయారు. ఊపిరి పీల్చుకోవటమే అతికష్టమయ్యేది. కళ్లు పీక్కుపోయినయ్. శరీరాలు పచ్చబడిపోయినయ్.. చివరకు టిఖోన్ పార్ఖోనోవ్ తన పైభాగంలో జర్మనుల గోల విన్నాడు.

మూడువేల కిలోగ్రాముల ప్రేలుడు వస్తువులు జర్మనుల పాదాలక్రింద పేలినై... భయంకరమైన ధ్వని వాళ్ల గట్టును కదల్చివేసింది.

దెబ్బమీద దెబ్బ తగిలింది, శత్రువుకు.

ఇక్కడన్నీ వర్ణింప వలనికాని యుద్ధరంగాలైనాయ్. ఆ తాకిడికి ఇటుకలు, కలపముక్కలు ఆగలేకపోతున్నై. తుపానుగాలులాంటి గాలులకి పెద్దపెద్ద భవనాలు నేలకూలుతున్నై. ఏడుఅంతస్తుల భవనం యొక్క అయిదో అంతస్తులు కూలిపడినప్పుడు క్రింద అంతస్తులో మన సైనికులతోనున్న కీర్తిజేయుడైన ప్రాజలీయన్ వేదాంతం మాట్లాడాడు.

"నగరం అలసిపోయింది... ఈ ఇల్లు అలసిపోయింది. ఈ ఇటుకలుకూడ అలసిపోయినై... మనం మాత్రం కాదు..."

ఈ లోపున స్టాలిన్‌గ్రాడ్ యుద్ధతక్కెడ సిబ్బెలు నిలబడుతున్నై. చివరకు శత్రువు శిబ్బె కదలి పైకిపోయింది. అక్కడే నిలబడిపోయింది. సోవియట్ బలాలు శత్రువును చావు దెబ్బ కొట్టి తరిమివేశాయి.

మళ్లీ 62 వ సైన్యం రక్షణస్థితినుంచి తప్పించుకొని దాడిచేసేస్థితి కొచ్చాయి.

జర్మనులు మరణచక్రంలో బంధించబడ్డారు.

నగరంలోని ప్రతిజర్మనీ బలవత్తర రక్షణకేంద్రం కూలిపోయింది. అగ్నిమంటలనుంచి వోల్గానది తేరుకొంది.

డిసెంబరు ఆఖరవైన స్టాలిన్‌గ్రాడ్ యుద్ధం ప్రారంభమైనతరువాత మొదటిసారిగా వోల్గానదిదాటి ఎడమవైపు గట్టుకు వెళ్ళి చాలసేపు నిలబడి నగరాన్ని తేరిపారజూశాడు.

ఆహా! శిథిలావస్థలోకూడా ఎంత గంభీరంగా వుంది నగరం.

62 వ సైన్యం ప్రతిభ ప్రపంచమంతటా మారుమ్రోగుతోంది.

అంతులేని అభినందనప్రవాహం ప్రపంచం అన్నిమూలల నుంచీ వస్తోంది స్టాలిన్‌గ్రాడ్‌కు. ఒకరోజున పత్రికలన్నీ యీ సైన్యం పొందనున్న గొప్పబహుమతి—స్టాలిన్ బహుమతివార్తను ప్రకటించాయి. సర్వసేనాని శరీరం పులకరించింది. కళ్లు చెమ్మగిల్లాయి.

మన పవిత్ర మాతృభూమి ముద్దుబిడ్డ వాసిలీచుకోవ్ తాను స్టాలిన్‌గ్రాడ్ రక్షణకు పంపబడ్డప్పుడు తీసికొన్న ప్రతిజ్ఞను గుర్తు తెచ్చుకొన్నాడు.

"స్టాలిన్‌గ్రాడ్ కోసం నా ప్రాణాలనయినా వదులుతాను గాని శత్రువుకు మాత్రం స్వాధీనం చేయను." 31 జాన్యువరి 1943.

## పొలిమేర యుద్ధం

స్టాలిన్‌గ్రాడ్ మనవెనుక వుంది. వెనుదిరిగి చూస్తే స్టాలిన్‌గ్రాడ్ నగరదృశ్యం, ఇంటికప్పులు, ఫ్యాక్టరీగొట్టాలు స్పష్టంగా కనుపిస్తాయి. అందువల్ల ప్రతివాళ్ళకు బాగా జ్ఞాపకం వుంది స్టాలిన్‌గ్రాడ్ మన వెనుకనే వుందనే విషయం. కాని ప్రథమశ్రేణిలో గలిగిన అపాయకరమైన వాతావరణం యీ సత్యాన్ని వెనక్కునెట్టింది. ప్రతివాళ్ళ ముఖాల్లోను గంభీరత ఏర్పడింది. ప్రతివాళ్లు పెదవులు నొక్కి, విపరీతమైన శత్రుద్వేష వెలిగక్కుతూవున్న నిద్రలేని ఆ ఎర్రని కళ్ళల్లో భీకరంగా కనుపిస్తున్నారు.

మొదటి లెఫ్టినెంట్ వాసిలీ యాలెంకోను చూడగానే చపయేవ్ జ్ఞాపకానికొస్తున్నాడు. ఇతనిలో అతని పోలికలు చాల వున్నై. అస్పృశ్యమైన చివరపైకి మెలివేసిన గడ్డి రంగుమీసం, నిశ్చలమైన ఆ నీలికళ్లు; నాజూకుగా పెట్టిన అకందకపు టోపీ; అన్నీ తరచుగా (సినిమాల్లో) చూస్తున్న చపయేవ్‌ను గుర్తుచేస్తున్నై. అతను నిశ్శబ్దంగా లేచి పుట్టి పట్టుతూ నిలబడినప్పుడు అతనిలో మళ్లీ ఏదో ఒక

అక్కడ జరుగుతున్నదంతా చూస్తున్నాను. అంకుల్ వాన్యా ఆ చుట్టుప్రక్కలే వున్నాడని ఆ జర్మనులకు బాగా నమ్మకం. అందువల్ల వాళ్లు ముందుగా శౌర్యవిశిష్టుడై ఉన్న అంకుల్ వాన్యా తండ్రిని అరెస్టుచేశారు. అతన్ని అడిగినా అసలు రహస్యం చెప్పడని ఒక త్రాడుతో చంకలదగ్గర, కాళ్ళకు కట్టి రెండు టాంకులమధ్య పడేసి టాంకుల్ని పైగా తోలారు. అక్కడున్న ప్రజలు నిర్ఘాంతపోయి, భయవిహ్వలులై నిశ్చేష్టులైపోయి చూస్తున్నారు. వీళ్ళని బజారులోకి గెంటారు జర్మన్లు.

తరువాత ఆ గుంపులోనున్న ఆడవాళ్ళదగ్గరకొచ్చి ఒక్కొక్కరి చంకల్లోనున్న బిడ్డల్నిలాగి "అంకుల్ వాన్యా ఎక్కడున్నా"డని కుండ బ్రద్దలుకొట్టినట్టు అడిగారు. ఆడవాళ్లు ఏమీ మాట్లాడలేదు.

ఆ లాగిన యిరవైమంది పిల్లల్ని ఒకరిమీద ఒకర్ని పెట్టి ఒక కట్ట కట్టి ఆ టాంకుల క్రిందపెట్టి యింజనును కదల్చి బోతుండగా కెవ్వుమని, ఆ గుంపులోనించి సమష్టిగా పెద్ద అరుపు వినవచ్చింది. కాని ఆ యినుప యంత్రంతో సమానమైన హిట్లరు పశువులకి భయమేమిటి?...టాంకు నడిచింది. ఆ బిడ్డల తల్లుల హాహాకారాల మోతలో టాంకు మోత కలిసిపోయింది...పిల్లలంతా మట్టిలో కలిసి...!

ఈ సమయంలో టాలెంకో జేబులో చెయ్యిపెట్టి దానికి ఒకచేతి గ్రెనేడును తీశాడు. ఇంతలో ఒక చెయ్యి అతని చేతిని గట్టిగా పట్టుకొంది. అది సహాయకదళ సైనికుడిది. నెమ్మదిగా టాలెంకో చెవిలో చెప్పాడు:—

ఇంచుమించుగా చావుబ్రతుకుల్లో ఉన్నాడు. అక్కడ యుద్ధం లేదనీ, అతడున్నా లేకపోయినా, యుద్ధంమాత్రం యథాతథంగా సాగుతోందనీ, అలా హాస్పిటల్‌లలో కాళ్లు, చేతులు మెదపలేకుండా పడివుండటమే హాయిగా వుంటుందనీ తలచుకొన్న ఒక్క నిమిషమే శాంతంగా వున్నట్లు కనిపించింది. ఆ తెల్లని హాస్పిటల్ భవనపువార్డులో పడుకొనివున్న అతనికి ఆ నిమిషంలోనే బాధితమైన మనస్సులో బ్రతికి బయటపడతానా లేక యింతేనా అనే ప్రశ్న పుట్టింది. ఆ మరునిమిషంలోనే తుపాకిగుండు దూరిన ఊపిరితిత్తుల్లో పుట్టిన అతిదారుణమైన బాధతో ఒక మూలుగు మూల్గాడు. ఆ యెండిపోయిన పెదవులతోనే డాక్టరును అడిగాడు. "నేను బ్రతికి బయటపడతానా లేక యిలాగే అవిటి బ్రతుకు కావల్సిందేనా ?"

డాక్టరు నిష్కపటంగా చెప్పాడు: "నీవు బ్రతకగలిగితే ...మాత్రం అవిటి బ్రతుకు కాదు."

ఆ క్షణికమైన ప్రశాంతత, నిర్లక్ష్యత తాను బ్రతుకననే ఉద్దేశం అతనిలో కలగటంవల్ల వచ్చింది. ఇప్పుడా ఉద్దేశం లేదు. బ్రతకాలని వుంది. దీర్ఘ ఉచ్ఛ్వాసనిశ్వాసలు తీస్తున్నాడు. ఏమైనాసరే బ్రతకాలని, మళ్ళీ పునరుజ్జీవితుడై, పూర్తి ఆరోగ్యాన్ని పొంది, హిట్లరు కుక్కల్ని వెనకటిలాగే నాశనం చేయాలనీ ఆలోచిస్తున్నాడు.

సైన్యశాఖ [illegible] యితడు చేర్చబడ్డాడు. అతిత్వరలో కోలుకోవడానికి వైద్యం

జరుగుతోంది. అక్కడకు దగ్గరలోనేవున్న ఒక గ్రామంలో ఆ క్రిందటి సాయంత్రమే ప్రవేశించిన జర్మనులు ఉదయాన నగరంలో ప్రవేశించే అవకాశంకోసం చూస్తున్నారు. ఈ నివహం సరాసరి వచ్చి జర్మనులను ఉత్తరానికి తరమాలిసి వుంది.

పెద్దయెత్తున దాడి తప్పదు. అతని స్వానుభవాన్నిబట్టి మిలిటరీ యెత్తుగడలలో తిరోగమనంతో సైన్యాలకు యెంతో భారమవుతుంది. అతని సైనికులు దాడిని యెదుర్కో వటంతో ప్రారంభించటం ట్కాలెంకోకెంతో సంతోషాన్నిస్తోంది. మొదటిసారి యుద్ధానికి వెళ్లినవాళ్ళకు శత్రు శవాలమీదుగా విహరించటంకంటె ఆనందాన్నిచ్చే దేముంటుంది! అలాగే జర్మనులను హతమార్చటానికి బేయనెట్లను పుచ్చుకొన్న సోవియెట్ సైనికులకుకూడ నూతనోత్సాహం కలుగుతోంది.

దాడి ఉదయాన్నే ప్రారంభమైంది. ఆ గ్రామానికి ముందు భాగంలోవున్న కాలువ అంతా తుపాకిమందుతో నింపబడింది. టాంకులు యెక్కడివక్కడే ఉంది. శాపరు దళాలకు శ్రమలేకుండ, ముందుకుపోకుండ కాల్పులు సాగిస్తున్నాయ్. కాల్బలసైన్యాలు మాత్రమే ముందుకు వెళ్లాయి. అలా మూడువందల మీటర్లు ముందుకెళ్లిన తరవాత శత్రు కందకమోర్టారు తుపాకుల తాకిడి తగిలింది.

వాళ్లు కొండపైకి ప్రాకి వెళ్లాలి. వాళ్ళతోబాటు ట్కాలెంకోకూడ ముందుభాగంలో వున్నాడు. అకస్మాత్తుగా

అతడు తన గాయాలబాధను అనుభవించాడు. ఒక ఊపిరి తిత్తుతోనే శ్వాసపీల్చాలి. అందువల్ల అతనికి కొండ ఎక్కటం చాల బాధగావుంది. కాని అతడు యీ యుద్ధానుభవంలో నేర్చుకొన్నది అతి గాంభీర్యం. వృధాగా తుపాకిగుళ్ళను వ్యయంచేయకుండా నిశ్చలంగా వుండి అవసరమైనప్పుడు ఉపయోగించే పొదుపు నేర్చుకొన్నాడు. అతడి సైనికులు నేర్పుతోనే కాలుస్తున్నారు. అతడు వూహించినదానికంటె ఎక్కువనేర్పును ప్రదర్శిస్తున్నారు. నిజానికి ప్రతిసారి తాను ఆజ్ఞలు యివ్వాలి. కాని అలా కాకుండా అతని ఆజ్ఞయివ్వవలసిన అవసరం లేకుండానే వాళ్లు ముందుకు సాగిపోతున్నారు.

ఆ గ్రామంముందు వున్న మందుకాలువ దగ్గర యీ సైన్యాలను జర్మనులు భయంకరమైన మరతుపాకి మంటల్తో, ఎదుర్కొన్నారు. ఎలాగైతేనేం ఆ గ్రామ ప్రథమ గృహశ్రేణి దగ్గరపడింది. కొన్ని నిముషాల తర్వాత బాహాబాహీయుద్ధం జరిగింది ఆ వూరిబయట వీథుల్లో. శత్రు ఆటోమేటిక్ రైఫిల్ సైనికులు యిళ్లమీదనుంచి, గేట్లమీదనుంచి, కంచెల వెనకాలనుంచి కాల్చటం మొదలుపెట్టారు. అందులో ఒకడు వెనకగా నక్కి కాల్చటానికి ప్రయత్నించటంమొదలుపెట్టాడు. ట్కాలెంకో వాడిని తన రైఫిల్‌కు బలియిచ్చాడు. ఇక్కడ చివరి యింటివద్దకు వచ్చి ఆగాడు. జర్మనులతో భీషణపోరాటంలో మొట్టమొదటిసారి తన దళంతో మూడువందల మీటర్లు ముందుకు చొచ్చుకు వచ్చాడు. ఇప్పుడు, తన సైనికులు రణోత్సాహంతో వున్నారు.

ట్కాలెంకో నిలుచున్న చోటునుంచే తనచుట్టూ పరికించి చూచి మళ్లీ తన సైనికులకు కొత్త ఆజ్ఞల్ని యివ్వనారంభించాడు. ఇంతలో శాపర్లు టాంకులు వెళ్ళటానికి రెండుమార్గాల్ని తయారుచేశారు. నాలుగు టాంకులు దొర్లుకుంటూ కాలువను దాటి గ్రామంలో ప్రవేశించి ఆవీధి పొడుగునా కాల్పులు సాగించాయి. విపరీతమైన ఉధృతంలో సాగుతోంది పోరాటం.

అకస్మాత్తుగా ఆ వెనకనున్న కంచెమీదనుంచి ఒక మనిషి దూక్కవస్తున్నట్లుగా కనిపించింది ట్కాలెంకోకు.

"ఆగు!"

ట్కాలెంకోకు రెండుగజాల దూరంలో ఆగాడు ఆమనిషి. అతని దగ్గర రైఫిల్‌గాని, నెత్తికి టోపీగాని లేదు. నడుముకున్న బెల్టుకుమాత్రం కొన్ని చేతిగ్రెనేడులు వ్రేలాడుతున్నాయి. అతడు యుద్ధరంగంనుంచి పారిపోతున్నాడు. ఒక్కడే ఒక్కడు ఇంతవరకు కెవ్వూ చెయ్యలేదు! ఆగుమని కేకవేసిన తరువాత అతనెవరో గుర్తించటానికి ప్రయత్నించాడు. కాని గుర్తించలేకపోయాడు. ఆ పిరికిపంద ముఖం గుర్తించటానికి వీలులేనంత అసహ్యంగావుంది. భయంచేత గాదు అతనిముఖంలోనికి చూడలేకపోయింది. అసహ్యంతో. అతని చిన్నికళ్ళు యెక్కడైనా సందు వుందేమో చూసి ప్రాణాలు రక్షించుకొందామని ప్రయత్నిస్తున్నట్లున్నాయి.

"ఎక్కడికి వెళుతున్నావ్?" ట్కాలెంకో తన రైఫిల్ మీద చేయిపెట్టి గట్టిగా అడిగాడు.

...త్రము సమాధాన మేమీ చెప్పకుండా, బాగా క్రిందకు ... లెఫ్టినెంట్‌ను క్రిందకు త్రోయటానికి ప్రయత్నించాడు. ట్కాలెంకో రైఫిల్ మీట నొక్కాడు. ఆ పిరికి పంద ...డకు చేతులాన్చి నేలకొరిగాడు. ఒక రెప్పపాటు కాలం అమనిషి వంకచూచి వెంటనే ప్రక్కనున్న శాపరుకు తన అజ్ఞల్ని యిస్తున్నాడు. హృదయం అమితావేదన పడింది. పారుబోతు జానో కాదో తెలుసుకోకుండా తన సైనికుని చంపిన ఆహృదయమే జర్మనుల్ని చంపటానికి శిక్షణ యిస్తోంది.

కాని ఆ శాపరుకుగాని యింకా యితరులకుగాని అతనెంతకలత చెందింది తెలియనీయ దలచుకోలేదు. గంభీరంగా మొదలక కూరుకొన్నాడు. అతని ప్రశాంతవదనంలోనే తన సైనికులకు ఆపారుబోతును చంపింది ట్కాలెంకో కాదు, న్యాయచట్టమనీ-శిక్షకు పాత్రమైన యుద్ధన్యాయచట్టమని – తెలియచేయగా లనుకొన్నాడు.

మధ్యాహ్నానికి ఆ గ్రామాక్రమణ పూర్తయింది. ఒక వ్యక్తిని వెంటబెట్టుకొని గ్రామానికి ఉత్తరవైపుకు వెళ్లాడు ట్కాలెంకో. గ్రామం ఆక్రమించుకోబడినమాట వాస్తవమే కాని రక్షించుకోవటంకోసం ఆ వూరికి యెదురుగా ఒక కిలోమీటరు దూరంలోవున్న కొండల శ్రేణినికూడ వశపర్చుకోవాలి.

ట్కాలెంకో గ్రామంలోనే వుండిపోయాడు. మూడో కంపెనీని తనదగ్గర వుంచుకొని రెండో కంపెనీ అధికారి

కాష్కిన్‌నూ, స్థూలకాయంచేత ఎగతాళికి సైనికులంతా 'డిసెంబరిస్టు' అని పిలుస్తారు బొండా రెంకోను - మెషిన్‌గన్ కంపెనీకి అధికారైన ఇతన్నే బయటకు పంపాడు.

ఆ యుద్ధమూ వాళ్ళ కంపెనీలతో జర్మనుల యొడ [illegible] కాల్పుల మధ్యనుంచి తప్పించుకొంటూ ముందుకు సాగి వెళ్ళారు. రెండుగంటలైన తరవాత ఒక ఆర్డర్లీ, ఓల్గాన ఒడ్డున కాలువలు సాగిస్తున్న నలుగురు జర్మన్లను బొండా రెంకో పట్టుకొన్నాడని, వార్త తెచ్చాడు. [illegible] సంతోషించాడు కాని అతని పాత అనుభవం జర్మన్లు అంత టితో వూరుకోరని గుర్తుకు తెచ్చింది.

ఇప్పుడు, వెనక కాలువవద్ద వదలిపెట్టిన రెండు [illegible] ధ్వ సక తుపాకుల్ని తెమ్మని ఆజ్ఞాపించాడు. అంతకముందే వర్షం కురిసింది. కాలువఒడ్డు లోతుగాను జారుతూనూ వున్నాయి. తుపాకీముడములు బాగా క్రిందివైపుకు [illegible] మూతులు పైకిచూస్తూవుండేటట్లు పెట్టి రెండోవైపు ఒడ్డు పైభాగాన గుల్లుకడేటట్టు చేయాలి. సైనికులు శ్రద్ధగా అలాచేయటానికి ప్రయత్నిస్తున్నారు.

షుమారు ఐదుగంటల ప్రాంతం. ఆకస్మాత్తుగా [illegible] హేను భారీజర్మనుటాంకులు, ఒకటి, రెండు కంపెనీ [illegible] కొండలశ్రేణికి గ్రామానికి మధ్యనున్న లోయప్రాంతానికి వచ్చాయి. మన దళం వెటనే పోరాటానికి తలపడింది. కాని టాంకు విధ్వంసక గ్రేనేడులుగాని, తుపాకులుగాని యేమీ దగ్గర లేవు. ఇందువల్ల పరిస్థితి చాల కష్టతరమైంది.

దాడిదళాలు టాంకులతో వస్తున్నాయి. అప్పుడే జర్మనులు పెద్ద కందక మోర్టారుల్ని ప్రయోగించి మన కంపెనీయున్న ప్రదేశాన్ని అగ్నిమయంచేశారు. సార్జెంటు రొయిస్టమన్, సార్జెంటు చెబోక్సరోవ్ యిద్దరు టాంకు విధ్వంసక తుపాకులతో జర్మను టాంకుమీద అగ్నివర్షం కురిపించసాగారు. రెండు టాంకులు మండుతున్నై. కాని తక్కినవి టాంకు విధ్వంసకముఠాలను ధ్వంసంచేయటానికి ముందుకు వేగంగా వస్తున్నాయి. ఒక పావుగంట అయ్యేటప్పటికి మరోరెండు టాంకులు తగలబడిపోయాయి. మనసైనికులు విసిరిన చేతి గ్రేనేడులవల్ల తక్కిన టాంకులు మన కాల్బలసేనను నేల మట్టంచేయాలనే పట్టుదలతో ముందుకు అతితీవ్రంగా సాగి వస్తున్నాయ్. టాంకుల మీద వున్న ఆటోమాటిక్ రైఫిల్ సైనికులు క్రిందకుదూకి యెదురుదాడి సాగించారు. జర్మను టాంకులు మన ఎర్రసైనికుల్ని భూమిమీదనుంచి తలెత్తి చూడనియ్యకపోవటంవల్ల వాళ్ళ వీలైనంత దూరంలో వుంచటం చాల దుర్భరమైంది.

లెప్టినెంట్ బొండరెంకో కంపెనీ వెనుకభాగాన బయలు నుంచి వచ్చి వాల్గానదిలో పడే లోతైన ప్రవాహంవుంది. ముందు జర్మను టాంకులు వున్నై. ఈ పరిస్థితిలోనే అతడు తనకుముందు, వెనక వున్న సైనికులకు చేతి సౌజ్ఞతో యీ మాటలు చెప్పాడు:

"ఇక్కడే వీళ్ళను ఆపాలి, లేదా మన బొమికలనైనా వదిలిపెట్టాలి, అంతే!"

అక్కడ జరుగుతున్నదంతా ట్కాలెంకో చూస్తున్నాడు. ఆ రెండు కంపెనీలు తననుంచి వేరుచేయబడ్డాయి. పరిస్థితి విషమంగావుంది. ఆ ప్రథమావేశంలో తాను అక్కడకు వెళ్ళి వాళ్ళకు సాయం చేయాలనుకొన్నాడు కాని శాంతంగా ఆలోచిస్తే ఆ పనివల్ల వాళ్ళ కెక్కువ ప్రయోగం వుండ దనిపించింది. వాళ్ళరక్షణ, తుపాకుల సరఫరామీద ఆధార పడివుంది. ట్కాలెంకో వెంటనే ఆపనికి పూనుకున్నాడు అతని సహజప్రశాంతతతోనే. వాళ్ళకు అవసరమైనన్ని తుపాకుల్ని అందిస్తున్నాడు. అయినా వాళ్ళకు కాల్పుల్ని విజయవంతంగా సాగించటానికి వీలైన స్థలం దొరకలేదు. అయినా వున్నచోటునుంచే కాల్పుల్ని ప్రారంభించారు. అప్పటికప్పుడే టాంకులు వాళ్ళవైపుకు వెళ్ళటానికి బయలు దేరినై. అందులో రెండు మొదటి దెబ్బలకే తునకలై పోయినై. ఇదే ఆ పోరాటంలో 'నిర్ణయఘట్టం' (Turning Point) అయింది. పదిహేను టాంకులకూ తొమ్మిది మాత్రమే మిగిలాయి. చీకటి పడుతోంది. ఇంక అవస్థ పడలేక ఆ మిగతా టాంకులు నెమ్మదిగా వెనుదిరిగాయి. ఆటోమాటిక్ రైఫిల్ సైనికులు కూడ టాంకులతో నేల మీదకు యెక్కికూర్చున్నారు. ఆ రాత్రంతా కూడ యేదో విధంగా యుద్ధం సాగుతూనే వుంది. తెల్లవారేటప్పటికి మిగి లిన నలుగురు జర్మనులూ కొండలచాటుకు పలాయనం సాగించారు రక్షణకోసం.

తెల్లవారిన తర్వాత మనసైనికుల్ని సమాధిచేశారు. చాల నష్టపడింది యీదళం. ట్కాలెంకో విచారగ్రస్తు

డయ్యాస్పు తన కష్టాన్ని చూచి. అయినా ఆనష్టం అనుకొనేది కాదు. అందరూ అనుకొన్నట్లే అయింది. కాని జర్మనులు పొందిన నష్టంలో సగానికి తక్కువగా నేవుంది యీ నష్టం. యుద్ధం ప్రారంభదినాల్లో ఒక్క ఎర్రసైనికునికి యిద్దరు జర్మన్లచొప్పున చచ్చారని తృప్తిపడ్డాడు కొంతవరకు. ఇప్పుడు—రెండు సంవత్సరాల దీర్ఘ యుద్ధానంతరం, ఎంతో నష్ట కష్టాలనంతరం—యుద్ధపర్యవసానం అంత సంతోషించ దగినంత బాగా లేదనిపించిందతనికి, ఆం! జర్మనులు మన మాతృభూమి మీదనే యుద్ధంచేస్తున్నారు. చనిపోయిన ఒక్కొక్క ఎర్రసైనికునికి యిద్దరు జర్మన్లనుకాదు నలుగుర్ని, పదిమందిని హతమార్చినేగాని యీ క్రోధం నశించదు. నిన్నటియుద్ధంలో యీపని జరగలేదు. అందువల్ల అతను విచారగ్రస్తుడై వున్నాడు.

ఈ స్థితిలో వుండగానే, పగటిపూట, అతన్ని చూడటానికి నేను వెళ్ళాను. అతని ముఖారంలో దీర్ఘాలోచనతో మామూలు ప్రశాంతతతో నే కూర్చున్నాడు. అతడు తన జీవిత విశేషాల్ని వివరిస్తున్నంతసేపూ ఆ ముఖంలో యే మాత్రమైనా చిరునవ్వైనా కనుపిస్తుందేమోనని ప్రయత్నించాను. చివరకు మేము బయటికి యెండలోకి వెళ్ళాము. అతని ముఖంవైపు చూచాను వెలుగులో. అతడి మీసాలే అతని ముఖంలో వయస్సుకుమించిన గాంభీర్యాన్ని తెచ్చిపెట్టా యనిపించింది.

“ఆ బుగ్గమీసాలు యెప్పుడూ చేయించదలచుకోలేదా యేమిటి?” అన్నాను.

మొట్ట మొదటిసారిగా అతను అప్పుడు సిగ్గుతో కూడిన చిరునవ్వునవ్వి అన్నాడు.

"నీకు తెలియదూ? నేను చేయించుకోలేను. అలా ప్రతిజ్ఞ తీసుకొన్నాను. క్రిందటి సంవత్సరం శత్రుశ్రేణుల వెనుక ఆఖరిసారిగా భూ పరీక్షచేస్తున్నప్పుడు మనవాళ్ళు నలుగురుపోయారు. అందులో, ముగ్గురు అక్కడక్కడే పోయారు. నాలుగోవాడు ఖోమెంకో నా చేతుల్లోనే మన శ్రేణులదగ్గరికి చేర్చేటప్పటికి పోయాడు. అందులో బ్రతికి వున్న వాళ్ళల్లో యిద్దరం అతన్ని సమాధిచేశాం. మాలో ఆరోవాడు సాంఖరెడ్జె—అతను జార్జియన్. స్కౌటింగు పార్టీసభ్యుడు—నాతో "చూడు లెఫ్టినెంట్, మనం యీ చని పోయినవాళ్ళ స్మారకచిహ్నాలుగా గడ్డాలుచేయించుకొందాం. కాని యీ యుద్ధానంతరం వరకు అంటే మనం వాళ్ళ కోసం యుద్ధంచేసేంత వరకు యీ బుగ్గమీసాల్ని మాత్రం గొరిగించుకోవద్దు' అన్నాడు. అదీ నేను తీసుకొన్నప్రతిజ్ఞ."

ట్కాలెంకో మరోసారి సిగ్గుతో విచారపూరితమైన చిరునవ్వు నవ్వాడు రెండోసారిగా.

"ఓ! బొండారెంకో యిక్కడే వున్నాడు. అతన్ని, అతని కంపెనీని చూడవూ?"

బలాఢ్యుడు, రక్తవర్ణముఖుడు, "డిశెంబరిస్టు" బొండా రెంకో వచ్చాడు. నేను ట్కాలెంకోవద్ద శెలవుతీసుకొని బొండారెంకో వెంట అతని కంపెనీ చూడటానికి బయలు దేరాను.

అతను తన కంపెనీ తొట్లు కందకాలు వగైరాలన్నీ చూపించాడు. తరువాత నిరీక్షణ కేంద్రాన్ని చూచాను. అది మంచి రహస్యప్రదేశంలో వుంది. అక్కడనుంచి చూస్తే ఆరువందలమీటర్ల దూరంవరకూ జర్మన్ల రక్షపోకలు స్పష్టంగా కనుపిస్తాయి. అదంతా చూస్తే ఆ కంపెనీవాళ్లు ఒక్క అంగుళం నేలకూడ జర్మనుల స్వాధీనం కాకూడదనే పట్టుదలతో కందకాలనిర్మాణం చేసినట్లు కనిపిస్తుంది.

ఆ సదికిపోయే లోతైనకట్టమీదుగా వెళ్తున్నాం. ఆడవాళ్లు,పిల్లలు, ముసలివాళ్ళు ఆక్రమితగ్రామాలనుంచి వచ్చి ఆ కొండగట్టులలో వున్న గుహల్లో తలదాచుకొంటున్నారు. పిల్లల ఏడ్పులు భయంకరముగా వినిపిస్తున్నాయ్. ఆ తల్లుల అలసిపోయినకళ్ళు మావైపు ఆశాపూరితంగా చూస్తున్నై. ఈ దృశ్యాలన్నీ కళ్ళబడ్డై.

బొండారెంకో ముఖంవైపు చూసాను. ఇంతకుముందే వాళ్ళ! దళనాయకుని ముఖంలో చూచిన క్రోధాగ్ని జ్వాలల్నే మాతని చిరునవ్వు ముఖంలో స్పష్టంగాచూచాను.

"చూడు! పందులు వాళ్ళను ఏస్థితికి తెచ్చారో చూడు. వాళ్ళు మన ప్రజల్ని యేస్థితికి తెచ్చారో ఆలోచించు!" అన్నాడు.

మానవుని సహిష్ణుతాశక్తికి కూడ హద్దులున్నై. అది దాటిననాడు అక్కడ— ఆ రోజుల్లో స్టాలిన్‌గ్రాడ్ వద్ద ష్కాలెంకో, బొండారెంకో అందరితోకూడ వుండి భీషణ పోరాటాన్ని చూచిననాడు— వున్న యే మానవునికైనా

శత్రువుమీద తప్పక ద్వేషంపుడుతుంది; ఒకే ఒక కోరిక కలుగుతుంది - శత్రునాశనం!

## సైనిక ప్రతాపము

రాత్రిపూట స్టాలిన్‌గ్రాడ్ నగరంచుట్టూ ఆకాశంలో ఒక వెలుగు ప్రకాశిస్తూవుంటుంది. పగటు కందకమోర్టారు గుళ్లుప్రేలి వచ్చేపొగతో, యుద్ధరంగంలోని వంటశాలల్లో నుంచి వచ్చేపొగలతోను, సైనికుల ఘాటైన పొగాకుచుట్టల నుంచి వచ్చేపొగలతోను ఆ బయలంతా పొగ-ఉగ్రక్కుతూ ఉంటుంది.

నీలాకాశంలో మరీ కాంతివంతముగా వున్న సెప్టెంబరు నెలలో యుద్ధవిమానాలు పొగలువదుల్తూ పోతుంటాయి.

ఆ బయలులో ప్రఖ్యాతి, అపఖ్యాతులు రెండూ ఒకే చోట కనుకుతున్నాయి. ఆ చీకటి రాత్రులే పగలంతా పోరాడి రక్తశిక్తలై దుమ్ముకొన్ని పడివున్న సైనికులకు దీర్ఘ విశ్రాంతి నిస్తున్నయ్.

ఆ యుద్ధభూమి అపరిచితములైన పచ్చిక బయళ్ళతోను, కొండగుట్టలతోను చేదుచెట్లు (Worm-wood)దట్టంగా పెరిగి వున్న వనమార్గాలతోను నిండివుంది. ఆ ప్రాంతం శత్రు స్వాధీనం కాకుండెను. అక్కడి ఎర్రసైనికులకు ఆ గ్రామ మేదో తెలియదు. అక్కడ ప్రవహిస్తూన్న కాలువపేరు తెలియదు. వారికి తెలిసినదల్లా వారివెనుకనే స్టాలిన్‌గ్రాడ్ వున్నదనీ ఆ నగర రక్షణకోసమే జాగ్రత్తగ పోరాడా లని మాత్రమే.

ప్రాణాలే ధారపోసి యిస్తే దానిఖరీదు ఎంతఅయినా సరే యిచ్చి యిక్కడే శత్రువును ప్రతిఘటించాలి. ఈవేళ శ్రేణి రక్షణ జరిగింది కాని విజయంసమకూరలేదు. ఇంకా రష్యన్ సేనల ప్రతాపం చూపబడలేదిక్కడ. కాని ప్రతిపగలు, ప్రతిరాత్రి, అక్కడ యిక్కడ ప్రతిక్షణం ప్రతిచోట రష్యన్ సైనికుడు తన ప్రతాపాన్ని ప్రదర్శిస్తున్నాడు. మానవ ప్రతాపం ఎల్లప్పుడూ వీర్యవంతమే. కీర్తి - యీకీర్తికోసం జాతి అంతా ఆహుతైనా ఫరవాలేదు.

సిమన్ ష్కాలెంకో, నేను ఆ ఎండు నేలమీద కూర్చొని వున్నాం. ఒక పిల్లవాయువు అతని ప్రశాంతమైన, ఎండ దెబ్బతగిలిన ముఖాన్ని స్పృశిస్తూపోయింది.

“ఆ పని ఎలాచేశావో చెప్పవూ?” అని అడిగాను.

“ఎలా చేశానో చెప్పనా?” అని ఆ బయల్లోకి తన దృష్టిని బరపి దీర్ఘంగా ఆలోచిస్తూ ఆ చెప్పబోయే విషయం నిన్నమొన్నగాక చాలాకాలం క్రిందట జరిగినదని దాన్ని గుర్తుకు తెచ్చుకుంటూ, ఆ ఘట్టమే తన జీవితానికి నాంది ఐనట్లూ నెమ్మదిగా, అల ‘చరాధోరణిలో చెప్ప నారంభించాడు.

“నా తండ్రిపేరు ఫ్రోవ్. ఆయనకూడ యీప్రాంతాల్లో జరిగిన యుద్ధాల్లో పాల్గొన్నవాడే. ఇది జారిట్సిన్ నగరానికి యింకా స్టాలిన్‌గ్రాడ్ పేరుపెట్టక పూర్వపు సంగతి. ఇక్కడే పోరాటంలో ఆయన పోయారు. నాలాగే ఆయన కూడ ‘మైనరు’. నాకు మేము పనిచేసిన ఆ గని నింపబడిం

డనీ, లేక ప్రేలవచ్చుననీ మాత్రమే తెలుసు. అది రెండో నంబరు ఇస్తాదేవ్ గని. కందకంలో యీ విద్యను పూర్తిగ నేర్చుకొన్నాను. స్పెష్టి డ్రైవరు దగ్గరనుంచి, పూర్తిజ్ఞానం కలిగిన మైనరునుంచి, ఫోర్‌మన్ వరకూ నేర్చుకొన్నాను. నేను గనిలోనికి వెళ్లి చాలకాలమైంది. 1924 లో చిన్న కుర్రాడిగా వున్నప్పుడు వెళ్లాను. ఎన్నాళ్లైందంటావ్? అప్పటికి 18 సంవత్సరాలైందా? కావచ్చు. ఇవ్వాళ నా జన్మదినోత్సవం. అవును, పద్దెనిమిది సంవత్సరాలైంది. ఇవ్వాళ కమిస్సార్, నేను కలిసి విందు చేసుకొన్నాం. నా భార్య నాకొడుకు యూరిసిమ్యనోవిచ్ ఆరోగ్యంకోసం యీ విందుచేశాను. నేను యింతవరకు నాకొడుకును చూడ లేదు. మార్చి 27 న పుట్టాడు.''

ఒక నిముషంసేపు ఆలోచించి మళ్ళీ మొదలుపెట్టాడు. ''యూరిసిమ్యనోవిచ్'' అని గంభీరంగా తన కొడుకు పేరు ఉచ్చరించాడు. ఆపేరును ఉచ్చరిస్తూ తనవంశ నామాన్ని నిలుపుతాడనీ, తన సాంప్రదాయవృత్తి మైనరు వృత్తిని కొనసాగిస్తాడనీ ఆలోచిస్తూ గంభీరంగా పెట్టాడు ముఖం. ఆలాగే అతడి గనిని గురించీ, తన కుటుంబాన్ని గురించీ తనశ్రమ జీవితాన్ని గురించి చెప్పాడు. అతడు సైనికుడుగా గడించినకీర్తి అతని అనుభవాన్ని, తెలివితేటల్ని రష్యన్ సైనికుని అంగసౌష్ఠవాన్ని తెలియజేస్తుంది. అతడుతనజీవిత విశేషాలను యెంత ప్రశాంతంగా, నెమ్మదిగా, ఆలోచనా పూర్వకంగా చెప్పుతున్నాడో అంతే ప్రశాంతతతో, నెమ్మ

చాలా ఆలస్యం అవుతుంది. ఇప్పుడు ముప్పై సెకండ్లు త్వరగా పోవాలనుకొన్నాడు. లేచి వంగి పొదల్లోనుంచి దారి చేసుకొని ముందుకుపోతున్నాడు. ఒక అరగంటలో ఒకటి, రెండు కాల్వల్ని దాటాడు. మూడో కాల్వ దాటగానే మూడు గుడిసెలూ, ఒక యిల్లూ కనపడ్డాయ్. ఆ ప్రదేశమంతా పొదలతో నిండివుంది. ష్కోలెంకో నేలమీద పడుకొని నెమ్మదిగా పాకిపోతున్నాడు. మొదటి గుడిసెదగ్గరకు చేరి లోపలకు తొంగిచూచాడు. లోపల అంతా చీకటిమయంగా వుంది. తేమ తేమగా వుంది. పంది, దాని పిల్లలూ గుడిసె అంతా తిరుగుతూ నేలను గీకుతున్నాయ్. మరునిముషంలో రెండుదూలాలమధ్యానవున్న కొయ్యగోడ - గుడిసెగోడలు కొయ్యవి—ప్రక్కనే లోతైన కందకం, గోడలో కన్నాలు కనుపించాయ్. ఆ కందకం ప్రక్కనే సగం ఖాళీఐన జర్మనుల సిగరెట్టులపెట్టె (Package) వుంది. జర్మన్లు ఆ దగ్గర ప్రాంతంలో ఎక్కడో వుండివుండాలి. అందు కేమీ సందేహం లేదు. రెండో గుడిసె ఖాళీగా వుంది. మూడో గుడిసె ప్రక్కనే ఒక పెంటప్రోగు దగ్గరలో ఇద్దరు ఎర్రసైనికుల శవాలు పడి వున్నై. వాళ్ళ రైఫిళ్ళు శవాలప్రక్కనే వున్నై. నెత్తురు మరకలు కొత్తగా కనుపిస్తున్నై.

అక్కడ జరిగినదాన్ని వూహించటానికి ప్రయత్నం చేస్తున్నాడు: "వీళ్ళు యిక్కడకు ఏమీ రక్షణ లేకుండ వచ్చివుంటారు. వీళ్ళను దూరాన్నుంచే చూచి జర్మన్లు కాల్చివుంటారు." ష్కోలెంకో వాళ్ళ ప్రమత్తతకు చాల విచారించాడు. "వాళ్ళు నా ప్రక్కనేవుంటే యిలా జరగ

విచ్చేవాళ్లేకాదు" అనుకొన్నాడు. ఈ విషయాన్ని తలచు కొంటుంటే యింకా యితర విషయాలు గుర్తుకొస్తున్నయ్. తన మనుష్యులు భూమికింద వెళ్లేప్పుడుకూడ సరిగా వెళ్ళటం లేదు. ఎక్కువ జాగ్రత్తగా వెళ్ళటంలేదు సరే! ఇంకా యీ విషయాన్ని గురించి ఆలోచించటానికి సమయం కాదు. జర్మన్లు యెక్కడున్నారో చూడాలి.

గుబురుగా పెరిగిన తీగలమధ్యగా వెళ్ళి ఒక యిరుకు మార్గాన పోతున్నాడు. ఉదయానపడ్డ మంచుచేత నేలంతా యింకా తడిగానే వుంది. ఎవరో అడవిలోకి పోయినట్లుగా కాలిజాడలు స్పష్టంగా కనుపిస్తున్నై. ఒకవందగజాలు ముందుకెళ్లేసరికి జర్మనీసైనికుని బూట్లజత, యుద్ధరైఫిలూ కనిపించాయి. అవి అక్కడికెట్లా వచ్చాయో అతనిజీవితంలో ఊహించలేని విషయాలు. ఎందుకైనా మంచిదని ఆ రైఫిల్ని నేలలో పాతిపెట్టి బూట్లను పొదల్లోకి విసిరిపారేశాడు. కొత్త అడుగుజాడలు అడవిలోకి పోయాయి. పొక్కలెంకో యింకా నాలుగడుగులు ముందుకేశాడో లేదో ఒకమర తుపాకిపదిసార్లు ప్రేలింది ఆగి, ఆగి.

అతని కెదురుగానే ఒక పొద వుంది. నెమ్మదిగా అందులో దూరి ఎత్తుగా పెరిగిన గడ్డిలో వున్న ఒక గుంటలో కూర్చున్నాడు. ఆ గొయ్యినిండా బూడిదవుంది. అదియేమిటోనని చూస్తుం డగా ఆ పొదల్లో కొంచెం ఖాళీప్రదేశం వున్నట్లు కనిపించింది. ఆ పొదల్లోకిచూస్తే ఒక పదిగజాల్లో కందక మోర్టారు తుపాకి, యింకా కొంచెందూరంలో ఒక తేలిక మర

తుపాకి వుంది. కందక మోర్టారు తుపాకివద్ద ఒకడు, యింకా కొంచెందూరంలో కొంతమంది చక్రాకారంగాను కూర్చుని యేదో తింటున్నారు. ఈ దృశ్యం కనబడగానే అతని చెయ్యి ఆటోమాటిక్ రైఫిల్ మీదకు పోయింది. మళ్ళీ వెంటనే ఆ వుద్దేశం మార్చుకొన్నాడు తెలివితేటల్తో. ఆటోమాటిక్ రైఫిలుమీదనుంచి చెయ్యి టాంకు విధ్వంసక గ్రెనేడుమీద పడింది. విసరటానికి తయారవుతున్నాడు. ఈ ఆయుధాన్ని నిర్ణయించటంలో అక్కడున్నవాళ్ళందర్నీ ఒక్కసారిగా తుడిచి పెట్టాలని ఉద్దేశం. పైగా వాళ్ళకు అతనికి మధ్య దూరంకూడ యెంతోలేదు. నెమ్మదిగా ఆలోచిస్తూ తనపని చేసుకొంటున్నాడు. తొందరపడవలసిన అగత్యం యేమీ లేదు. అతని యెర ముందేవుంది. ఎడమచేతిని గోతిలో నొక్కి పెట్టి నెమ్మదిగా కొంచెంపైకిలేచి గ్రెనేడ్‌ను విసిరాడు. అది సరిగావెళ్ళి ఆ గుంపుమధ్యలో పడింది. అటువైపు చూచేసరికి ఆరుగురూ చక్కగా విశ్రాంతి తీసుకొంటున్నారు నేలమీద దీర్ఘంగా, వీళ్ళకు కాపలాగావున్న ఏడోవాడు గుండెలుపగిలి ఆశ్చర్యపోయి, తుపాకీమడమ యెలా పోయిందా అని చూస్తున్నాడు. షోకలెంకో వెంటనే గోతి బయటకుదూకి ఆటోమాటిక్ రైఫిల్ సిద్ధంగా వుంచుకొని ఆ జర్మనీవాణ్ణి సౌజ్ఞతో తోటాలతోవున్నవాడి బెల్టును అవతల పారవేయమని, వాడు రివాల్వరును, ఆ బెల్టును దూరంగా విసిరివేసిన తర్వాత వాడిదగ్గరకు వెళ్లాడు. ఆ జర్మనీవాడు ఆ పాదమస్తకం కంపించిపోయి తోటాలు, రైఫిల్ పారవేయటానికి సతమతమై పోయాడు. వాణ్ణి

ముందు నిలబడమని షోక్‌లెంకో మరతుపాకి దగ్గర కెళ్ళి దాన్ని చూచాడు. తోటాలు లేవు అందులో. వాణ్ణి ఆతుపాకి యెత్తుకోమని సైగచేసి వాడు అతి విధేయతతో భుజాల మీద పెట్టుకొన్న తర్వాత యిద్దరూ బయలుదేరారు.

ఆ పరిస్థితి యెంతగంభీరంగా వుందామనుకొన్న షోక్‌లెంకోకు నవ్వు తెప్పించింది. జర్మనువాడి చేత తుపాకి మోయించుకొనిరావటం వేళాకోళంగా కనుపించింది. ముందు జర్మనువాడు వెనుక షోక్‌లెంకో ఆ విధంగా మనశ్రేణుల దగ్గరకు వెళ్తున్నారు. జర్మనీవాడు నెమ్మదిగా, ఎదురు తిరగటానికి యేమాత్రం ప్రయత్నం చేయకుండ నడుస్తున్నాడు. కాని అతడికి తన వాళ్లెవరైన కనపడక పోరనీ, కనపడితే వాళ్ళ సహాయంతో పారిపోవచ్చనీ ఆశమాత్రం పోలేదు. ఇప్పటి వరకు జాగ్రత్తగా, నెమ్మదిగా తనపని పూర్తిచేసిన షోలెంకో యిప్పుడు తొందర పెట్టటం సాగించాడు. అతడు ఒంటరితనాన్ని గుర్తిస్తూ వెనుక భాగాన్నుంచి యేపొరబాటు నుంచైనా తుపాకితో కాలుస్తారనే భయంతో తొందరపడ సాగాడు. అతడు యేపనికీ అవసరానికిమించి తొందరపడలేదు. కాని యిప్పుడుమాత్రం వీలైనంత త్వరలో తన సైనికశ్రేణుల్ని జేరాలని ఆతురతతో జర్మనీవాడి వీపు మీద తన రైఫిల్‌తో పొడుస్తున్నాడు త్వరగా నడవమని.

మధ్యాహ్నానికి తనశ్రేణుల్ని జేరుకొన్నాడు షోక్‌లెంకో. కెప్టెన్ కోపెలివ్ ప్రక్కనే దళవాయి కూర్చునివున్నాడు. షోక్‌లెంకో ఆ జర్మనీవాడిని పొడిచి అన్నాడు :

''ఇక్కడే వుండు.''

తర్వాత పూర్తివివరాలతో తన రిపోర్టు యివ్వ ప్రారంభించాడు. దళవాయి ష్కోలెంకోతో కరస్పర్శ గావించాడు. ఒకసారి అతన్ని పైనుంచి కిందకు సాకల్యంగాచూచి ఆనందంతో మళ్ళీ కరస్పర్శచేశాడు. అటువైపుకు తిరిగి దళవాయితో గుస గుస లాడాడు ష్కోలెంకో. ష్కోలెంకో ఆజ్ఞలకోసం యెదురుచూస్తున్నాడు.

"చాల మంచిపనిచేశావు. మీా కెప్టెన్ ఆజ్ఞను చక్కగా పాలించావు." అన్నాడు దళవాయి కెప్టెన్ వంక చూస్తూ. "ఇప్పుడు న కోసంకూడ కొంత పనిచేయాలి. ఆ మిగిలిన కందక మోర్టారు తుపాకులు యెక్కడున్నాయో వెదికి తీసుకురావాలి" అన్నాడు మళ్ళీ.

"అవును" అని క్లుప్తంగా సమాధానమిచ్చి 'నేనుఒకణ్ణే వెళ్ళాలా, దయచేసి శెలవియ్యండి' అని అడిగాడు.

"ఒంటరిగానే" కెప్టెన్ కోషెలెవ్ అన్నాడు.

"మరీ మంచిది అయితే" అని ష్కోలెంకో తన రైఫిల్‌ను సర్దుకొన్నాడు.

"కాస్త విశ్రాంతి తీసుకో. తర్వాత వెళ్ళవచ్చునులే!" అన్నాడు దళవాయి.

ష్కోలెంకో సిగ్నలర్స్ వున్నచోటికి వెళ్ళాడు. అక్కడ కూర్చొని ఆహారపుసంచినుంచి ఏదో తీసుకొని తింటున్నాడు. అలసట చెందివున్నాడు. కొంచెమైనా విశ్రాంతి లభించినందుకు సంతోషించాడు. భోజనం అవగానే సిగరెట్టు ముట్టించాడు. ప్రొద్దుటనుంచి ఒక్కసారైనా కాల్చలేదు.

మళ్ళీ సాయంత్రంవరకు అవకాశం దొరకదు. అందువల్ల యిప్పుడు కాలిస్తే కుతితీరుతుంది కొంతవరకైనా. బూట్లు వూడదీసి కాళ్ళపట్టీలను సర్దుకొని కాళ్ళు నొప్పులుతీరటానికి ఒక అరగంట విశ్రాంతితీసుకొని, రైఫిల్‌ను సరిచేసికొని ప్రొద్దున వెళ్ళినదారినే వెళ్ళాడు.

ఈసారి గ్రామానికి కుడివైపుగాను, నదికి దగ్గరగానూ రోడ్డుకు అటూ యిటూ బాగా పెరిగిన పొదలలోనుంచి పైకి కనుపించకుండా వెళ్తున్నాడు. ఒక అరమైలుదూరంలో మొదటిసారి కందకమోర్టారు ప్రేలినశబ్దం వినిపించింది. ఆ ప్రదేశానికి వెళ్ళటానికి దట్టంగా పెరిగిన ఆ పొదల్లోనుంచి ప్రాకి వెళ్ళవలసివచ్చింది. అతనిముఖం చేతులు గీరుకుపోయినై. అతని తలమీదుగా గుళ్లు దూసుకుపోయి దూరంగాపోయి పడ్డాయి. అక్కడ ఒకనిమిషం ఆగి ఆలోచించాడు. తుపాకులు అమర్చబడిన స్థలాన్ని గుర్తించటానికి శబ్దాన్నిబట్టి ఏవైపునుంచి ఎంతదూరాన్నుంచి వస్తున్నాదో గుర్తించటానికి ప్రయత్నంచేస్తున్నాడు. ఆ పొదలు దాటినతర్వాత ఒక చిన్నగుట్ట యెక్కాలి. మళ్ళీ ఆవైపున పల్లంవుంది. ఆ ప్రదేశమంతా చెట్లతో నిండివుంది. అతడు ఫర్లాంగుపైగా ప్రాకివెళ్ళాడో లేదో ఒక జర్మనీవాడు యితని కెదురుగా దగ్గరలో నిలబడివున్నాడు. తుపాకికాల్పులు ఆగిపోయాయి. పదినిమిషాలపాటు నిశ్శబ్దంగా పడుకొన్నాడు నేలమీద. జర్మనీవాడు కంటికి కనుపించకుండా వెళ్ళిపోయినతర్వాత లేచి చిన్న చిన్న పొదలలో నుంచి ప్రాకిపోయి ఒక పెద్ద పొదచాటునుంచి తొంగిచూచాడు. ఆ గుట్టక్రింద పల్లంలో

మూడు కందక మోర్టారు తుపాకులు స్పష్టంగా కనుపిస్తున్నయ్.

షోలెంకో నేలమీద బోర్లగిలా పడుకొన్నాడు. జేబులో నుంచి ఒక తెల్లకాగితపు ముక్క తీసి ఆప్రదేశపుప్లాను వేసుకొని, కందక మోర్టారులు యెక్కడ వున్నాయో సరిగా గుర్తించుకొన్నాడు. అప్పుడీకందక మోర్టారుల దగ్గరవున్న జర్మన్లందరూ ఒకేచోట గుమిగూడి ఒక కందక మోర్టారు తుపాకివద్ద చుట్టూ కూర్చున్నారు. అతనికి దగ్గరలోనే అతనికి, వాళ్ళకు షుమారు ఏడెనిమిది గజాల దూరంకంటె యెక్కువలేదు. వాళ్ళల్లో ఒక్కడుమాత్రం దూరంగా కందకపు ఒడ్డున పడుకొని టెలిఫోనులో మాట్లాడటానికి వ్యర్థ ప్రయత్నం చేస్తున్నాడు.

జర్మనులంతా—ఒక్కడు మినహా—ఒకేచోట గుంపుగూడి అతనికి దగ్గరలో వుండటం, అతన్ని సాహసకార్యానికి పురిగొల్పింది. కాని అక్కడ పరిస్థితుల పూర్తి వివరాలతో గూడిన ప్లానును తుపాకి సైనికుల కివ్వటమే అతనికర్తవ్యం అయినా జర్మనులంతా ఒకేచోట వున్నారు. అతనిదగ్గర గ్రెనేడులువున్నాయి. తాను చేయవలసిన పనినంతా ఒక నిముషంలో నిర్ణయించుకొన్నాడు షోల్కెంకో. ప్రొద్దున కూడ అదేపరిస్థితిలో తనకార్యసాఫల్యం అయింది. అదృష్టవంతుడయ్యాడు. బహుశా అందువల్లనే అతడు ఒంటరిగా అలాంటి సాహసానికి పూనుకొని వుంటాడు. అతడు నేలమీద పడుకొనివుండే రెండుటాంకు విధ్వంసకటాంకు గ్రెనేడ్లను తీసి రాగితీగెతో కట్టాడు. ఒకచేతిని నేలమీద

మోపి గట్టిగా గాలి పీల్చి బలంతో ఊసితెచ్చుకొని వాటిని రెండోచేత్తో విసిరివేశాడు. ఆ రెండు గ్రెనేడ్లు బరువైనవి. అదీగాక యిది ఆవేళ రెండోసారి. బాగా అలిసిపోయాడు. ఆగ్రెనేడ్లు వాళ్ళకు ఒక అర్థగజం దూరంలో అవతలగా పడటం నేలమీదకు ఒరగబోయేటప్పుడు చూచాడు. మరు నిముషంలో అతనికే భుజంమీద తగిలింది. అయినా అంతగట్టిగా తగలలేదు. దెబ్బ తగిలినచోట చెయ్యిపెట్టి చూచాడు. రక్తం కారుతోంది.

వెంటనేలేచి నిలబడి తన ఆటోమాటిక్ రైఫిల్‌ను సరి చేసుకొన్నాడు. గ్రేనేడులప్రేలుడు చాలపెద్దగావుంది. ఈ సారి ఒక్కడుకూడ ప్రాణాలతో మిగలలేదు. అకస్మాత్తుగా టెలిఫోనువద్ద నున్నవాడు వెలికిలా తిరిగాడు పడివుండి. వాడిలో ప్రాణం వున్నట్లుంది. ఖ్లోలెంకోవాడిదగ్గర కెళ్లాడు. వాడు చేతులెత్తి యేమో చెప్పబోయాడు. కాని ఆపరిస్థితి వేడిలో యిదేమి చూడలేదు. టెలిఫోనుదగ్గరకెళ్ళి దాన్ని తీసుకెళ్లే వుద్దేశంలేదు గనుక-తన బూటుకాళ్ళతో తొక్కి నిరుపయోగంగా చేశాడు. ఆ తర్వాత ఆమోర్టారు తుపా కుల్ని యేం చేయాలని అటూ యిటూ చూస్తున్నాడు. షుమారు యిరవై గజాల దూరంలోవున్న పొదల్లోనుంచి కదలికధ్వని వినవచ్చింది. తన రైఫిల్‌ను పొట్టకానించి పొదవైపుకు గురిచూచి కాలుస్తున్నాడు. చివరకు జర్మను లకు బదులుగా తనకు చిరపరచితుడు, మిత్రుడు అయిన సాటరోవ్- ఒక దళానికి చెందిన ప్రైవేటు, అంతకు కొన్ని రోజులకు ముందే జర్మనుల ఖైదీగా పట్టుబడ్డాడు - బోసి

కాళ్ళతో, దుమ్ముకొట్టుకొని, లోదుస్తులతో మాత్రమే వుండి గుర్తుపట్టటానికి వీలైనంత పెద్దగా కేకలువేస్తూ షోర్కలెంకో వైపుకు చూస్తూ వచ్చాడు.

"మనవాళ్లే, మనవాళ్లే వచ్చేది!"

అతని వెనుకనే పదహారుమంది పొదల మాటునుంచి వచ్చారు. వాళ్ళందరూకూడ సాటరోవు వున్న స్థితిలోనే భయంకరంగా కనుపిస్తున్నారు. అందులో ముగ్గురు రక్తసిక్తులై వున్నారు. ఒకడు యితరుల చేతుల ఆధారంతో తీసుకురాబడ్డాడు.

"నీవేనా కాల్చింది?" సాటరోవ్ అడిగాడు.

"అవును" అన్నాడు షోర్కలెంకో.

"అయితే వీళ్ళని హతమార్చింది నీవే నన్నమాట. మిగతా వాళ్లేరి?" అని అక్కడ పడివున్న వాళ్ళవైపు చూపించి అడిగాడు.

"నేను ఒంటరిగానే వున్నాను. అయితే మీ రిక్కడ నేంచేస్తున్నారు?" అన్నాడు షోర్కలెంకో.

"మాకోసమే మేమొక గోతిని త్రవ్వుతున్నాం. మమ్మల్ని యిద్దరు ఆటోమేటిక్ రైఫిల్ సైనికులు కాపలాకాస్తున్నారు. ఇక్కడి ప్రేలుడు శబ్దం విని పారిపోయారు. అలాయితే నీ వొక్కడే నన్నమాట!"

"అవును ఒక్కణ్ణే!" అని సమాధాన మిచ్చి ఆ మోర్టారులవంక చూచాడు. ఇంక ఆలస్యం చేయటానికి వీలులేదు, ఇదే అతని ఆలోచన అప్పుడు. "ఈ కందక

మోర్టారులు పుచ్చుకోండి. ఆలస్యంచేయకూడదు. త్వర పడాలి. మన శ్రేణుల దగ్గరకు వెళ్ళటం మంచిది ముందు'' అని వ్యవహారరీత్యా చెప్పాడు.

కొందరు ఆ తుపాకుల్ని భుజాలమీద పెట్టుకొని బయ ల్దేరారు. మిగతావాళ్ళు క్షతగాత్రుల్ని తీసుకెళ్ళుతున్నారు. ఇప్పుడు మొదటిసారికంటె యెక్కువ తొందరపడుతున్నాడు ష్కోటెంకో. ఇదివరకు పొందిన అనుభవాలతో వీలైనంత తొందరలో ఆప్రదేశాన్నుంచి పోవాలని చూస్తున్నాడు. ఏమాత్రం ఆలస్యం జరిగినా వాళ్ళ అదృష్టం దురదృష్టంగా మారవచ్చు. ఆముతా వెనుక అతిజాగ్రత్తగా నడుస్తూ, చెప్పుతూ అన్నివైపులాచూస్తూ, అతిశ్రద్ధగా వింటూ, తనరైఫిల్‌ను సిద్ధంగా వుంచుకొని నడుస్తున్నాడు ష్కోటెంకో.

వాళ్ళ వెనక నడుస్తున్నప్పుడు రక్తసిక్తాలైన వాళ్ళశరీ రాలు బాగా కనుపిస్తున్నై. తన సాహసధైర్యాలకు ఆశ్చర్య పోయాడు. ''ఇంకా నయం, మనవాళ్లెవరూ చావలేదు. అయినా ఎవరికి తెలుసు వాళ్ళక్కడున్నారని?'' అను కొన్నాడు మనస్సులో. ''నాకు తెలియదుసుమా! జర్మను లనుకొన్నాను'' అని తనప్రక్కనే నడుస్తున్న సాటరోవ్‌తో అన్నాడు.

''నిజంగా నాకు తెలియదు. జర్మనులే అక్కడున్నా రనుకొన్నా'' నన్నాడు.

''కావచ్చు. నీకెట్లా తెలుస్తుంది?'' అన్నాడు సాట రోవ్ క్లుప్తంగా.

టెలిఫోను దగ్గరవున్న జర్మనీవాడు యీ యెర్రసైనికుల మధ్య నడుస్తున్నాడు దెబ్బతగిలిన తలను చేతులతో పట్టుకొని. అంతకుముందే తమ గోతుల్ని తామే త్రవ్వుకొంటూ యిప్పుడు యిలా నడిచివెళ్తున్న సైనికుల్ని చచ్చిబ్రతికొచ్చారా అన్నట్లు ఆశ్చర్య, భయ, విస్మయాలతో చూస్తూ నడుస్తున్నాడు. పోట్కిలెంకోకంటె ఆ అర్ధదిగంబర, రక్తసిక్తులైన సైనికులే అతనికి భయంకరంగా కనుపిస్తున్నారు.

సుమారు గంటన్నరకు చుట్టుదారిని వెళ్ళి తమ సైనిక శ్రేణుల్ని చేరుకొన్నారు. పోట్కిలెంకో పూర్తివివరాలతో తన రిపోర్టు యిచ్చాడు. కెప్టెన్ సంగ్రహంగా అభివందనాలర్పిస్తూ కరస్పర్శగావించాడు. నాలుగైదడుగులు వెనక్కి వేశాడో లేదో పోట్కిలెంకో నేలమీద పడిపోయాడు.

ఆ రోజంతా పడిన శ్రమకు అతడు అమితంగా అలసిపోయాడు. విప్పారినకళ్ళతో తనచుట్టూ చూచాడు. పచ్చని గడ్డి ప్రొద్దునవున్నట్లుగానే కనుపించింది. అతను చేయవలసిన సాహసకార్యాలన్నీ అయిపోయినట్లుగా తలచాడు.

సూర్యాస్తమయమైంది. నలువైపులనుంచీ చీకట్లు క్రమ్ముకొంటున్నయ్.

కొంత సేపైనతర్వాత "నీకు తెలుసా, దళవాయితో నేను ఒంటరిగా వెళ్తానన్నది. యెందుకో? ఏమంటావ్? తోడులేకుండ ఒంటరిగా వెళ్ళటం మంచిదా? కాదు. చాల ప్రమాదకరమైన విషయం. భూపరిశీలన కెళ్ళేటప్పుడెప్పుడూ ఒక కామ్రేడ్ తోడు చాల అవసరం. అతన్ని యెరిగివున్న

ప్పుడే అది జరగకపోతే ఒంటరిగా వెళ్ళటమే మంచిది. నిజంచెప్పాలంటే ఎరగనివాళ్ళని వెంటతీసుకెళ్ళటం మంచిది కాదని గుర్తించకపోవటం సిగ్గుచేటు. నేను గనిలో పనిచేసే టప్పుడుకూడ నాతోటివాడు నాకు తెలియనివాడైతే పని చురుకుగా సాగేదికాదు. ఇక్కడ యింకా యెక్కువ. నీకు తెలియనివాణ్ణి నీవెంటతోడుగా తీసుకెళ్ళటమంటే మృత్యువును నీకు తోడుగా వెంటబెట్టు కెళ్ళటమన్నమాట. నన్ను గురించి నాకెంత తెలుసో నావెంట వచ్చేమనిషిని గురించి కూడ అంత తెలిసివుండాలి. అప్పుడే నమ్మకంగా వుంటుంది. కాని మనుష్యులు యీ విషయాన్ని అసలు యేమీ తెలుసు కోరు. తెలుసుకోవటానికి ప్రయత్నమైనా చేయరు. కారణ రహితంగా సుపరిచితుల్ని ఆ వైపుకూ యీ వైపుకూ పంపి విడదీస్తారు" అన్నాడు షోర్లెంకో.

లేచివెళ్తూ తన ఆలోచనల్ని బయటికి చెప్పున్నాడు.

"నీమధ్య నా మధ్య—మృత్యువు నీ ప్రక్కనున్నదనుకో. సహజంగా నీవు భయపడతావు. కాని సంవత్సరంపైనుంచి నేను జర్మనులతో పోట్లాడుతున్నాను. నా వుద్దేశం: జర్మను వాడికి మనం యేమీ భయపడనట్లు కనుపించామా యిక వాడు పలాయన మంత్రం పఠిస్తాడు. భయపడినట్లు కనుపించామా యిక బ్రతకలేము. సాధారణంగా యుద్ధంలో పరిస్థితులిలాగే వుంటాయ్. మనలో ఒకళ్లు యింకొకరికి భయపడి వుండాలి. కాని నేను యెప్పుడూ అతడే భయపడి వుండాలంటాను.

షెర్బెంకో బయలులోకి చీకట్లో దూరంగా దేన్నో వెదుకుతున్నట్లు చూస్తూండగా ఒక విషాద పూరితమైంది అతని వదనం.

"ఏమిటట్లా చూస్తున్నావ్?" అని అడిగాను.

"వాడు మనల నెంత వెనక్కు కొట్టాడు? నిజంగా మనల్ని చాల వెనక్కి కొట్టాడు."

తీవ్రతరమైన అతని గంభీర వాక్కుల వెనక రెండు పరుసు సత్యాలు తళుక్కున మెరిశాయ్. వాడు—జర్మనీవాడు—మనల్ని చాల వెనక్కి కొట్టాడు. ఇంక అడ్డు చేయాలి. ఏ సైనికుడైనా ధైర్యవంతుడైతే అతడు షెర్బెంకోను పోలివుంటాడు. తీవ్రంగా యీ విషయాన్ని ఆలోచించిన కొలదీ అతనికి పట్టుదల యెక్కువై తిరోగమించాడు.

ఆ బయలంతా కందకాలతోను, తోట్లతోను, కందక మోర్టారు తుపాకులతోను నిండి భయంకరమైన తుపాకి, బాంబు మ్రోతలతో ప్రతిధ్వనిస్తోంది. స్టాలిన్‌గ్రాడ్ వెనుక భాగమంతా యింకా తెలియకుండా అలానేవుంది.

బొరోడినో అనేపేరు ఒక మొజైస్క్ జిల్లాలో మాత్రమే తెలిసివుండేది. కాని యిప్పుడు ప్రతియింట్లోను అతి పరిచయమైంది. బొరోడినో చుట్టుప్రక్కల ప్రాంతాలు నిమాన్, మోస్కువానదులమధ్య ప్రదేశాలకంటె యేమీ తీసిపోయేవి కావు. మంచివీ కావు. బొరోడినో ప్రదేశం అభేద్యమైనదిగా వుంది. ఎందుకంటె రష్యన్ సైనికులు ప్రాణాలైనా యివ్వటానికి సిద్ధంగా వున్నారని శత్రువును మాత్రం ముందుకు

ర్గానీయరు. అందువల్లే లోతైన ఈ చిన్ననదిదాట నశక్యంగా వుంది. కొండగుట్టలు గుబురుగావున్న అడవిప్రదేశం, హాడావిడిగానిర్మించిన కందకాలు చూడ నశక్యంగా వున్నై.

స్టాలిన్‌గ్రాడ్ చుట్టూవున్నబయలులో అనేకకుగ్రామాలు, గుట్టలు, చిన్న యేరులు వున్నై. వీటిపేర్లు ఒక వందమైళ్ళ దూరంలోవున్న వాళ్ళకే తెలియవు. కాని అక్కడి ప్రజలంతా యీ ప్రదేశంలో ఒక గ్రామంపేరు చిరస్థాయి అవుతుందని, యీ ప్రదేశమే విజయసాధనకు మూలభూమి అవుతుందని నమ్మకంతో వున్నారు.

—సిమొనోవ్.



Printed at the B. N. K. Press, Madras—1945 Q. H. K. 62 D



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA127B144 |
| పుస్తకం పేరు | స్టాలిన్ గ్రాడ్ యుద్ధచరిత్ర |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 129 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 4 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |